బాలానంద బొమ్మల

# రాజు - పేద

మూలం:

మార్క్ ట్వైన్

స్వేచ్ఛానుసరణ:

సింగంపల్లి అప్పారావు




నవరత్న బుక్ హౌస్

కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ-520002.

రాజూ - పేద

రచన :

సింగంపల్లి అప్పారావు

ప్రథమ ముద్రణ :

నవంబర్ 2000

ముఖచిత్రం :

రవి

లోపలి బొమ్మలు :

వి.యస్. ప్రకాష్



బి. కె. ఆర్. మూర్తి (పబ్లిషర్)

28-22-20, రహిమాన్ వీధి

అరండల్ పేట, విజయవాడ-2

ఫోన్ : 432813

ముద్రణ :

డి. బి. ప్రింటర్స్

విజయవాడ-2

వెల : రు. 25-00

## విద్యార్థినీ విద్యార్థులకు అమూల్య నేస్తాలు

ఇంగ్లీష్-తెలుగు డిక్షనరి
తెలుగు-ఇంగ్లీష్ డిక్షనరి
హిందీ-తెలుగు డిక్షనరి
తెలుగు నిఘంటువు
త్రిభాషా డిక్షనరి
తెలుగు-హిందీ డిక్షనరి
ఇంగ్లీష్-ఇంగ్లీష్ డిక్షనరి
ఇంగ్లీష్-హిందీ డిక్షనరి
హిందీ-ఇంగ్లీష్ డిక్షనరి
రసాయన శాస్త్ర నిఘంటువు
జంతుశాస్త్ర నిఘంటువు
వృక్షశాస్త్ర నిఘంటువు
గణితశాస్త్ర నిఘంటువు
భౌతికశాస్త్ర నిఘంటువు
ఇంగ్లీష్ వ్యాసాలు-లేఖలు
హిందీ వ్యాసాలు-లేఖలు
తెలుగు వ్యాసాలు-లేఖలు
ఇంగ్లీష్ గ్రామర్
హిందీ గ్రామర్ (హైస్కూల్)
హిందీ గ్రామర్ (డిగ్రీ)
లాఫ్లీ జోక్స్
త్రిభాషా వ్యాకరణం
ఎంకిపాటలు
హితవాహిని
తెలుగు వ్యాకరణము
సులభ వ్యాకరణము
45 రోజుల్లో ఇంగ్లీష్
45 రోజుల్లో హిందీ
ఇంగ్లీష్ తెలుగు స్వబోధిని
హిందీ తెలుగు స్వబోధిని
గణిత ఒలింపియాడ్ (తెలుగు)
గణిత ఒలింపియాడ్ (ఇంగ్లీష్)
గణిత సూత్రములు
గణితము-సమస్యలు-సాధనలు
ప్రాథమిక గణిత శాస్త్ర స్వబోధిని
అంక గణితం
గణితశాస్త్రం (బీజగణితం)
స్మాల్ స్కేల్ ఇండస్ట్రీస్
ఫోటోగ్రఫీ నేర్చుకుందాం
తెలుగు సామెతలు
ఇంగ్లీష్ తెలుగు సామెతలు
మీ ఆంగ్ల పదజాలం పెంపొందించుకోండి
జోక్స్ వరల్డ్
1001 జోక్స్-జోక్స్-జోక్స్
1001 వింతలు-విచిత్రాలు
నవ్వులు
ఖగోళశాస్త్రం-క్విజ్
కార్టూన్లు

# బాలసాహిత్యంలో - బంగారు మొలకలు

బాలానంద బొమ్మల షిరిడీ సాయిబాబా
" అరేబియన్ నైట్స్ అద్భుత కథలు (3 భాగాలు)
" షేక్స్పియర్ అద్భుత కథలు(3భాగాలు)
" బైబిల్ కథలు (2 భాగాలు)
" సింద్‌బాద్ సాహస యాత్రలు
" రాబిన్‌సన్ క్రూసో సాహస యాత్రలు
" డాన్ క్విక్సోట్ సాహస యాత్రలు
" రాబిన్‌హుడ్ సాహస యాత్రలు
" రెండు మహానగరాల కథ
" డేవిడ్ కాపర్ ఫీల్డ్
" ఆలివర్ ట్విస్ట్
" రాజు - పేద
" ప్రపంచ అద్భుత కథలు
" పంచ తంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" టిప్పుసుల్తాన్
" వీరపాండ్య కట్టబ్రహ్మన

బొమ్మల మర్యాద రామన్న కథలు
" అల్లావుద్దీన్ అద్భుత దీపం
" అలీబాబా 40 దొంగలు
" అక్బర్ బీర్‌బల్ వినోద కథలు
" భేతాళ కథలు
" తెనాలి రామకృష్ణ కథలు
" పరమానందయ్య కథలు
" భట్టి-విక్రమాదిత్యుల కథలు(2భాగాలు)
" అపూర్వ చింతామణి
" కాశీ రామేశ్వర మజిలీల కథలు
" గలివర్ సాహస యాత్రలు
" భగత్‌సింగ్
" బి. ఆర్. అంబేద్కర్
" సుభాష్‌చంద్రబోస్
" ఆజాద్ చంద్రశేఖర్
" రాజా రామమోహనరాయ్
" మదర్ థెరిసా
" రవీంద్రనాథ్ టాగూర్
" జయప్రకాష్ నారాయణ్
" యోగి వేమన
" పూజ్య బాపూజీ
" భగవతీచరణ్

# రాజూ - పేద కథ

ప్రపంచ ప్రసిద్ధిగాంచిన లండన్ మహానగరంలో 1530 సంవత్సరంలో ఇద్దరు కుర్రవాళ్ళు జన్మించారు. వాళ్ళిద్దరూ ఒకేవిధంగా వుండటం విశేషం. ఒకరి ప్రక్కన మరొకరు నిలుచుంటే కవలపిల్లలా! అన్నంత భ్రమ కలుగక మానదు.

అందులో ఒకడు టామ్‌కేంటీ. రెండవవాడు ప్రిన్స్ ఆఫ్ వేల్స్....యువ రాజు.

టామ్‌కేంటీ భిక్షమెత్తుకొని జీవించే నిరుపేద కుటుంబంలో జన్మించాడు. తండ్రి జాన్‌కేంటీ! చిల్లర దొంగతనాలు చేస్తూ వుంటాడు. దొరికిన వాటిని అమ్మేసి ఆ డబ్బుతో తాగేస్తూ వుంటాడు.

టామ్‌కి ఓ నాయనమ్మ వుంది. అన్నదమ్ములు- అక్కచెల్లెళ్ళు వున్నారు. వాళ్ళు లండన్ వీధుల్లో అడుక్కుని వచ్చిన వాటిని తెచ్చి నాయనమ్మకు యిస్తూ వుంటారు. పిల్లలు ఎన్ని తెచ్చి యిచ్చినా నాయనమ్మ పిల్లల్ని చీదరించుకుంటూ చేతిలోని కర్రతో వాళ్ళను చితక బాదుతూ వుండేది. వీలు చిక్కినప్పుడల్లా జాన్ కేంటీ కూడా తాగివచ్చి పిల్లల్ని చావబాదుతుండేవాడు.

లండన్ బ్రిడ్జివద్ద 'ఓఫల్ కోర్టు' వుంది. ఆ కోర్టు సమీపంగా అడుక్కునే వాళ్ళ గుడిసెలు, పేదవాళ్ళ ఇళ్ళు ఎక్కువగా వుండేవి. జాన్‌కేంటీ నివాసం అక్కడే.

సోదరులు, సోదరీమణులు అడుక్కునేందుకు వెళ్ళిన తర్వాత టామ్ నిద్ర లేచేవాడు. లేచీలేవగానే అడుక్కునే బొచ్చె పుచ్చుకొని వీధిలోకి బయలుదేరేవాడు.

జాన్‌కేంటీ పిల్ల లెవరికీ అక్షరంముక్క రాదు. టామ్ పుట్టిన సంతోషం ఆ కుటుంబంలో ఎవరికీలేదు. మరొక ముష్టివాడిని కని లోకంలోకి విడిచిపెట్టానే అని తల్లీ, ఇప్పుడున్న యిన్ని నోళ్ళకు ఆహారం పెట్టలేక బాధపడుతుంటే మరొక నోరు తనపాల బడిందే అని తండ్రీ బాధపడ్డారు.

యువరాజు పుట్టుక ఎంతమందికో ఆనందం కలిగించింది. రాజ భవనం యావత్తూ వేల్స్ యువరాజు జన్మించినందుకు ఆనందంతో వేడుకలు జరుపు కున్నారు. మహారాజు, మహారాణి ఆనందానికి అవధులు లేకపోయాయి. సామంతు లకు మంత్రులకు రాజభవన ఉద్యోగులకూ, సేవకులకూ విలువైన బహుమానాలు అందజేసారు.

భగవంతుడు సృష్టించిన మానవులు ఒకేవిధంగా వున్నా వాళ్ళ స్థితి గతులలో ఎంత తేడా! యువరాజుకు ఎంతోమంది సేవకులు అతడికి అన్ని సుఖభోగాలు కాళ్ళవద్దరకు వస్తాయి.

కానీ పేదవాడయిన టామ్‌కి అలా కాదు. అతడు ఏనాడయినా రాగినాణెం తీసుకురాకపోయినా నాయనమ్మ ఊరుకొనేదికాదు. ఆనాడు అతడు పస్తుతో పడుకో



పేదకుటుంబంలో పుట్టిన టామ్ తానొక యువరాజుగా భావించుకొని
లండన్ వీధిలో రాచఠీవిగా నడుచుట

వలసిందే! కన్నకడుపు వుండబట్టక అతడి తల్లి చాటుగా ఎండిన రొట్టెముక్క పెట్టి నిద్రపొమ్మనేది. టామ్ అది తిని యిన్ని మంచినీళ్ళు తాగి ఏ మారుమూలనో నేలమీద పడి నిద్రపోయేవాడు.

టామ్‌కి ఏదీ లేకపోయినా చక్కటి పగటికలలు కంటూ వుండేవాడు. మహా

రాజు హెన్రీ VIII కి తను కొడుకుగా పుట్టినట్టు, తాను వేల్స్ యువరాజునయినట్టు ఊహించుకొనేవాడు.

లండన్ వీధులలో తిరుగుతూ చేతిలోని అడుక్కునే గిన్నెను కిరీటంవలె నెత్తిమీద పెట్టుకొని హుందాగా నడిచేవాడు. తనను వందిమాగధులు కీర్తిస్తున్నట్టూ సేవకులు సేవలు చేస్తున్నట్టూ, విలువయిన దుస్తులు, ఆభరణాలు ధరించినట్టూ, నటిస్తూ వుండేవాడు. మహారాజ భోజనం ఆరగించినట్టు ఆనందించేవాడు.

టామ్ స్నేహితులు ఇదంతా చూసి నవ్వుకొనేవారు.

"చూడండి! ఏదో ఒకనాడు నేను నిజమయిన యువరాజును చూస్తాను" అనేవాడు టామ్.

"నీ తరంకాదు.'ప్రిన్స్ ఆఫ్ వేల్స్'ని చూడడమంటే వీధులలో అడుక్కోవడమనుకొన్నావా?" అనేవారు స్నేహితులు.

టామ్ తన బట్టలవంక చూసుకొనేవాడు. అవి చిరిగి పీలికలయి మట్టి కొట్టుకుపోయి వుండేవి. యువరాజునయిన తనకు అటువంటి దుస్తులా! అనుకొని తిన్నగా థేమ్స్‌నదికి వెళ్ళేవాడు. నదిలో స్నానంచేసి తనబట్టలను మురికి నీటిలో ఉతుక్కొని వచ్చేవాడు. లండన్ టవర్‌వద్ద సిపాయిలు తీసుకువెళ్ళే ఖైదీలను సిపాయిలు ఒక క్రమపద్ధతిలో నడిచే నడకనూ శ్రద్ధగా చూసేవాడు.

యువరాజువలె జీవితం గడపాలన్న కోరిక నానాటికి టామ్‌లో బలపడసాగింది. స్నేహితులముందు యువరాజువలె నటించేవాడు. కనిపించని సేవకులకు ఆజ్ఞలు జారీచేసేవాడు. సేవకులు తప్పులుచేసినట్టు, వాళ్ళను దండిస్తున్నట్టు అభినయించేవాడు.

చలికాలపు రోజులలో టామ్ లండన్ వీధులలో తిరుగుతూ దుకాణాలలోని ఉన్ని వస్త్రాలవంక చూసేవాడు. ఖరీదయిన రొట్టెలు, ఆహారపదార్థాలవంక ఆశగా చూసేవాడు. అయినా టామ్‌కి చలిబాధ తగ్గేదికాదు- ఆకలిబాధ చల్లారేదికాదు. ఆకలి కడుపుతో వచ్చి నేలమీద మేను వాల్చేవాడు. అతడికి ఎప్పుడో నిద్రపట్టేది. ఆ నిద్రలో పెద్ద విందు జరుగుతున్నట్టూ, రాజవంశీయులు, అందమయిన యువతులు వచ్చి తనకు వంగి వంగి నమస్కారాలు పెడుతున్నట్టు కలగనేవాడు-

## 2

అన్నిరోజులు మాదిరిగానే ఆరోజు తెల్లవారింది. టామ్ నిద్రలేచాడు. ఆ ఇంటిలో ఎవరూ మరొకరి గురించి పట్టించుకోరు. టామ్‌కి ఆ రోజు ముష్టిఎత్తుకోవా

లనిపించలేదు. నెమ్మదిగా లేచి వీధిలోకి వచ్చాడు. భవనాలన్నీ దాటుకుని 'టెంపుల్ బార్' వరకూ వచ్చాడు. అతడు ఎప్పుడూ అంతదూరం రాలేదు. లండన్ నగర సరిహద్దు దాటుకుని ఎత్తైన సముద్రతీర ప్రాంతానికి వచ్చాడు.

అక్కడ ఎన్నోభవనాలు అందంగా తీర్చిదిద్దినట్టు ఉన్నాయి. ఆ భవనాలు ఉన్నత వంశానికి చెందిన ధనవంతుల రాజప్రాసాదాలు! టామ్ ఎప్పుడూ ఆ భవనాలను చూడకపోవడంవల్ల ఎంతో ఆశ్చర్యపోయాడు.



ఒకనాటి ఉదయాన్నే టామ్ లండన్ నగరవీధులగుండా బయలుదేరి
పెద్ద పెద్ద భవనాలను చూసుకుంటూ వెళ్ళుట

టామ్ ఇంకా ముందుకు వెళ్ళాడు. అక్కడ టామ్‌కి గ్రామీణ వాతావరణం కనిపించింది. అక్కడ కూడా ఎన్నో అందమైన భవనాలు కనిపించాయి. వాటిని చూసుకుంటూ టామ్ మరికొంత ముందుకు వెళ్ళాడు. అక్కడ విశాలమైన ఆవరణ,

వరణ మధ్యగా పెద్దరాజభవనం టామ్‌కి కనిపించాయి. ఆవరణకు ముందు ాగంలో ఇనుప కడ్డీలతో చేయబడిన ఎత్తయిన గేటు ఉంది.

దానిని చూసి టామ్ ఎంతో ఆశ్చర్యపోయాడు. ఆ భవనం ముందు సిపా ుల కాపలా ఉన్నారు.

టామ్ మెల్లగా ఒక సిపాయి సమీపంగా వెళ్ళి "ఈ భవనంలో ఎవరు ంటారు?" అని అడిగాడు.

"ఇందులో 'కార్డినల్' ఉంటారు". అని జవాబు చెప్పాడు సిపాయి. కార్డి ల్ అంటే ఏమిటో అలా ఎవరిని పిలుస్తారో టామ్‌కి అర్థం కాలేదు.

తర్వాత అతడు మరికొంత ముందుకు వెళ్ళాడు.

అక్కడ ఓ పెద్ద విశాలమైన భవనం కనిపించింది. టామ్ అంతకుక్రితం ాసిన భవనాలకంటే ఆ భవనం చాలా పెద్దదిగానూ అందంగానూ కనిపించింది. ుత్తం భవనం యావత్తూ రాతికట్టడమే! భవనం గోడలమీద అందమైన బొమ్మలు, తలు, నగిషీగా చెక్కబడి ఉన్నాయి. సింహద్వారం వద్ద ఉన్న గోడలకు అటు ుటు పెద్దరాతి సింహాలు అమర్చబడి ఉన్నాయి.

'ఒక్క మహారాజుగారు తప్ప అన్యులు ఎవరుంటారు ఇటువంటి భవనంలో' ునుకున్నాడు టామ్.

ఆ భవనానికి ఉన్న పెద్ద తలుపులు బంగారపు రంగులో ధగధగా మెరుస్తు ్నాయి. ఆ తలుపులకు అటుయిటు ఇద్దరు గార్డులు నిలుచుని కాపలా కాస్తున్నారు. ుయితేవాళ్ళు బొమ్మలకు మల్లే కదలక మెదలక నిలుచుని ఉన్నారు.

గేటు దగ్గరగా వెళ్ళి టామ్ లోనికి తొంగి చూసాడు! లోన ఉన్న ఉద్యాన నంలో వన విహారం చేయడానికి యువరాజు కానీ, మహారాజు కానీ వస్తే కన్నుల ండువుగా చూడవచ్చునని టామ్ ఆశ!...

ధనవంతులైన రాజవంశీయులు అందమైన గుర్రపు బగ్గీలమీద లోనికి ్తున్నారు. బయటికి వెళ్ళుతున్నారు. ఆ దృశ్యం టామ్‌కి నేత్రానందకరంగా కని ించసాగింది. విలువైన వస్త్రాలు ఆభరణాలు ధరించిన స్త్రీలు, పురుషులు అటు ుటు తిరుగుతూ కనిపించారు.

అదే సమయంలో యువరాజు అటుగా రావడం టామ్ చూసాడు.

బంగారు జలతారులో అల్లబడిన విలువైన వస్త్రాలు ధరించాడు. మొలకు

ఖడ్గమొకటి వ్రేళ్లాడుతూ కనిపించింది. నెత్తిమీద కిరీటం ఉంది. కిరీటం ఊర్ధ్వ భాగంలో అమూల్యమైన వజ్రం పొదగబడి ఉంది.

చివరకు రక్తమాంసాలున్న యువరాజును చూసాను. యువరాజుకు నా వయసే ఉంటుంది. అచ్చు నాలాగే ఉన్నాడు సుమా! ఎంత అందంగా ఉన్నాడు. చూడటానికి రెండు కళ్ళూ చాలవుసుమా! అనుకున్నాడు టామ్.



స్నేహితులతో యువరాజును చూస్తానని చెప్పిన టామ్ రాజభవనం వద్దకొచ్చి యువరాజును చూచుట

గేటుకున్న కటకటాలగుండా టామ్ యువరాజుని చూస్తూ ఉండిపోయాడు. అలా ఎంతసేపు ఉన్నాడో తెలియదు.

అంతలో గార్డు ఒకడు వచ్చి టామ్ చొక్కా పుచ్చుకుని "ఆ విధంగా యువరాజావారిని చూస్తూ ఉండటానికి నీకెన్ని గుండెలురా అడుక్కుతినే వెధవా!"

అంటూ దూరంగా తోసేసాడు.

ఆ తోపుకు టామ్ వెళ్ళి నేలమీద పడ్డాడు. అతని చుట్టూ జనం మూగారు. అంతేకాదు టామ్‌ని వెక్కిరించసాగేరు. వాళ్ళనవ్వులూ, కేరింతలతో అక్కడ మహా సందడి ఏర్పడింది.



గేటువద్ద నిలుచున్న టామ్‌ని రక్షకభటుడు రెక్కపుచ్చుకుని దూరంగా విసిరివేయుట

కాపలాభటుడు టామ్‌ని విసిరేయడం దూరం నుండి యువరాజు చూసాడు. అతడు విసురుగా గేటువద్దకు చేరుకున్నాడు. కాపలా వాళ్ళు యువరాజుకి తలలు వంచి నమస్కరించారు.

“మమ్మల్ని చూడవచ్చిన మా ప్రజలను యీ విధంగా బాధపెట్టడానికి మీకెంత ధైర్యం!... మరొకసారి యిలా చేసారంటే మీకు శిరచ్ఛేదం చేయిస్తాను.

ఆ కుర్రవాడిని లోనికిరానీయండి!" అన్నాడు యువరాజు.

యువరాజు అలా అనగానే ఆ ప్రదేశంలో నిశ్శబ్ద వాతావరణం అలుముకుంది. సిపాయిలు వెళ్ళి టామ్‌ని యువరాజు వద్దకు తీసుకొచ్చారు. యువరాజు నవ్వుతూ టామ్‌కి షేక్‌హ్యాండ్ యిచ్చాడు.

"నువ్వు బాగా అలసినట్టు కనిపిస్తున్నావు. ఆకలిగా కూడా ఉన్నట్టున్నావు. నాతోరా!" అన్నాడు యువరాజు టామ్‌తో.

యువరాజు తన రాజప్రాసాదానికి బయలుదేరాడు. టామ్ అతణ్ని అనుసరించాడు. అతడికి రంగు రంగుల అందమైన వృక్షాలు కనిపించసాగేయి. 'ఇది కలా! నిజమా!' అనుకున్నాడు టామ్.

"నీ పేరేమిటోయ్ కుర్రవాడా?" యువరాజు టామ్‌ని అడిగాడు.

"నా పేరు టామ్‌కేంటీ!" జవాబు చెప్పాడు టామ్.

"నీ పేరు అదోలా ఉంది. అది సరే! నువ్వు ఎక్కడ ఉంటున్నావు?"

"ఓఫల్ కోర్టువద్ద!" చెప్పాడు టామ్.

"నువ్వు చెప్పిన ఆ భవనం గురించి నేనెప్పుడూ వినలేదే! ఆ భవనం లండన్‌లోనే ఉందా?"

"అవును సార్!"

"నీకు తల్లిదండ్రులున్నారా?" యువరాజు ప్రశ్నించాడు.

"ఉన్నారండీ! నేనువాళ్ళతోనే ఉంటున్నాను. నాకొక నాయనమ్మా, ఇద్దరు అక్కలూ, సోదరులు కూడా ఉన్నారు."

"వాళ్ళంతా నిన్ను ప్రేమిస్తారా?"

"మా అమ్మ తప్ప ఎవరూ నన్ను ప్రేమించరు. మా నాయనమ్మ అయితే తాగి ఉన్నప్పుడు నన్ను గొడ్డును బాదినట్టు బాదుతుంది" అన్నాడు టామ్.

"ఆ ముసలిది నిన్నుకొడుతుందా? భటుల్ని పంపి ఆమెను ఈడ్చుకు రమ్మని చెబుతాను. ఖైదులో వేయించి శిక్షిస్తాను."

"వద్దండీ! పాపం ఆమె చాలా ముసలిది. చచ్చిపోతుందేమో!" టామ్ నాయనమ్మ మీద జాలి చూపించాడు.

"మరి మీ నాన్న సంగతేమిటి? అతను నీ యెడల ప్రేమగా ఉంటాడా?"

"మా నాన్నవన్నీ మా నాయనమ్మ బుద్ధులే! ఇక మా అక్కలున్నారు చూశాడూ. నా యెడల మంచిగానూ ఉండరు. చెడుగానూ కనిపించరు." అన్నాడు

టామ్.

"ఇక మా అక్కలున్నారు చూసావూ. లేడీమేరీ, లేడీజేన్‌గ్రే. ఇద్దరూ ఒక్కలాంటివారే! వాళ్ళు తమ సేవకురాండ్ర నవ్వులను కూడా పెదాల నుండి యివతలికి రానీయరు. మరి నీ అక్కలు వాళ్ళ సేవకురాండ్ర నవ్వులను అంగీకరిస్తారా?" యువరాజు అమాయకంగా అడిగాడు.

"సేవకురాండ్రా!.... మాకు సేవకులంటూ ఎవరూ ఉండరు యువరాజా!" అన్నాడు టామ్.



యువరాజు టామ్‌ని తన ఏకాంత మందిరానికి తీసుకువెళ్ళుట

యువరాజు ఆశ్చర్యపోయాడు. "నిజమే చెబుతున్నావా? అయితే మీకు బట్టలు అవీ ఎవరు తొడుగుతారు?"

"మేము బట్టలు మార్చుకోము యువరాజా! ఎందుకంటే మావంటి పేద

వారికి ఒకే ఒక జత బట్టలు మాత్రమే ఉంటాయి. ఆ జతబట్టలు ఎల్లప్పుడు శరీరం మీదనే ఉంటాయి కనుక!" అన్నాడు టామ్ సిగ్గుపడుతూ.

"అలాగా! అయితే మా ఆయాలతో చెప్పి బోలెడు విలువైన వస్త్రాలు నీకూ, మీ అక్కలకూ పంపిస్తాలే!" అన్నాడు యువరాజు.

"తీరికవేళల్లో ఏం చేస్తుంటావు?"

"పిల్లలతో కోతికొమ్మచ్చి ఆటలు ఆడుతూ ఉంటాను. కాలువల్లోనూ, నదిలోనూ బట్టలు విప్పేసి ఈతలు కొడుతూ ఉంటాము. ఇంకా ఎన్నోరకాల ఆటలు ఆడుకుంటూ ఉంటాము." అన్నాడు టామ్.

యువరాజు ఆలోచిస్తూ "నువ్వు చెప్పినవన్నీ చేయాలని నాకెంతో సరదాగా ఉంటుంది. మట్టిలో ఆడుకోవాలని చాలా ఉబలాటంగా ఉంటుంది. కానీ నా సంరక్షకులు ఉన్నారు చూసావూ! వాళ్ళు నేను బట్టలు విప్పేందుకు గూడ అనుమతించరు!" అన్నాడు.

టామ్ యువరాజు తొడుక్కున్న వస్త్రాల వంకచూస్తూ "నాకు మీలాంటి వస్త్రాలు ధరించాలని ఉంది." అన్నాడు టామ్ ఆశగా.

వెంటనే యువరాజు తన బట్టలన్నీ విప్పేసాడు. టామ్ కూడా తన బట్టలు విప్పి పక్కనపెట్టి యువరాజు విప్పిన విలువైన బట్టలు ధరించాడు. విలువైన వజ్రం గల కిరీటం ధరించాడు. బూట్లు మిగతా ఆభరణాలు ధరించాడు.

యువరాజు అక్కడున్న టామ్ బట్టలు వేసుకున్నాడు. అవి మాసిపోయి కంపుగొడుతున్నాయి. అయినా యువరాజు వాటిని అసహ్యించుకోలేదు.

యువరాజు ఏకాంతమందిరంలో పెద్ద నిలువుటద్దం ఒకటుంది. ఇద్దరూ అద్దంముందు నిలుచుని చూసుకున్నారు. తరువాత ఒకరినొకరు చూసుకుని ఆశ్చర్యపోయారు.

ఇద్దరిదీ ఒకే పోలిక! ఒకేరకం ముఖకవళికలు. ఒకే ఎత్తు, ఒకే వయసు.... ఒకేవిధమైన తలకట్టు....

"నువ్వు ఇక్కడే ఉండు! నేను బయటికివెళ్ళి క్షణంలో వస్తాను." అంటూ యువరాజు మందిరం తలుపులు తెరుచుకుని బయటికి వెళ్ళిపోయాడు.

టామ్ అక్కడే కూర్చుని తన వైభవానికి మురిసిపోసాగేడు. యువరాజు మురికిగుడ్డలతో యివతలికి వచ్చాడు. అతడికి ఎదురుగా సింహద్వారం వద్ద కాపలాభటులు కనిపించారు.

యువరాజు చకచకా నడుచుకుంటూ వాళ్ళ దగ్గరకు వచ్చి "తలుపులు తెరవండి!" అన్నాడు ఆజ్ఞాపించే ధోరణిలో.

ముష్టివెధవ మూలంగా యువరాజుగారిచేత తిట్లు తిన్న కాపలావాడు మురికిబట్టల్లో వున్న యువరాజును చూస్తూనే మండిపడ్డాడు.



యువరాజు వస్త్రాలు టామ్, టామ్ వస్త్రాలు యువరాజు ధరించడంవల్ల యువరాజును ముష్టికుర్రవాడు అనుకున్న రక్షకభటులు బయటికి తీసుకుపోవుట

చప్పున అతడి మెడపుచ్చుకుని విసురుగా గేటు బయటికి తోసిపారేసాడు. దానితో యువరాజు వేగంగా వెళ్ళి నేలమీద బోర్లాపడ్డాడు.

"నీవంటి అడుక్కుతినే వెధవకు ఇదే శిక్ష! పో! అవతలికి!" అంటూ కాపలావాడు గేటుతలుపులు వేసేసుకున్నాడు.

"ఓరేయ్! నావంటి రాజవంశానికి సంబంధించిన వ్యక్తిని అవమాన పరిచావు. నేనెవరో తెలుసా?.... మీ అందరికీ యువరాజును. ఈ దేశానికి కాబోయే మహారాజును! మహారాజుతో చెప్పి నీకు ఉరిశిక్ష విధిస్తాను. మర్యాదగా తలుపులు తెరుస్తావా? లేదా?" అంటూ యువరాజు కేకలు వేయసాగేడు.

అయినా కాపలా భటులు వినిపించుకోలేదు. రాతిబొమ్మలకుమల్లే నిలబడి ఉండిపోయారు.

జనం గుమిగూడి నవ్వడం ప్రారంభించారు. ఖడ్గం ఉంటే వాళ్ళ తలలు నరికేయాలన్నంత ఆగ్రహం ముంచుకొచ్చింది. నేలమీద పడటంవల్ల మోకాళ్ళు కొట్టుకుపోయి రక్తం చిమ్మి బాధపెట్టసాగేయి.

చేసేదిలేక యువరాజు నెమ్మదిగా లేచి కుంటుకుంటూ లండన్ నగరం దిక్కుగా బయలుదేరాడు.

## 3

వేల్స్ యువరాజు నెమ్మదిగా నడుచుకుంటూ బయలుదేరాడు. ఎక్కడికి వెళ్ళాలో తెలియదు. ఏం చేయాలో తెలియదు. అయినా నడుస్తూనే ఉన్నాడు. కాలికి తగిలిన దెబ్బ బాధపెడుతుండగా ఒక నీటిగుంట దగ్గరకు వచ్చాడు. చారలు కట్టిన రక్తాన్ని కడుక్కున్నాడు.

యువరాజు లండన్ నగరంలోకి ప్రవేశించాడు. అతని తండ్రి హెన్రీ VIII ఆ నగరాన్ని పరిపాలిస్తున్నా ఎక్కడ ఏమి ఉందో కూడా యువరాజుకి తెలియదు.

కొంతసేపటికి యువరాజు నగరంలో ఉన్న ఓ 'చర్చి' వద్దకు వచ్చాడు. పాడుపడిపోయిన ఆ చర్చిని రాజుగారు బాగుచేయించారు. పూర్వం ఆ చర్చిలో మతాధికారులు, పూజారులు ఉండేవారు. కానీ రాజుగారు దానిని బాగుచేయించిన తర్వాత అక్కడ అనాధ శరణాలయం వెలిసింది. దిక్కులేని పిల్లలు అక్కడ ఉంటున్నారు. ఆ సంగతి యువరాజుకు తెలుసు. 'వాళ్ళు తనకు తప్పక సహాయం చేస్తారు. తన విషయం రాజభవనానికి తెలియజేస్తారు' అనుకున్నాడు యువరాజు.

అక్కడ చర్చి ఆవరణలో చాలామంది పిల్లలు అటు యిటు తిరుగుతున్నారు. వాళ్ళు నీలంరంగు గౌనులు వేసుకున్నారు. ఎర్రరంగు బెల్టులు నడుముకు బిగించి కట్టుకున్నారు. శుభ్రంగా తలలు దువ్వుకుని చాలా అందంగా కనిపిస్తున్నారు. బడికి వెళ్ళే పిల్లలవలె ఉన్నారు.

యువరాజు గబగబా వాళ్ళ వద్దకు వెళ్ళాడు. ముష్టివాడు తమ వద్దకు

వ్చా డేమిటని వాళ్ళు ఆశ్చర్యపోతూ యువరాజును చూసారు.

"నేను ఎడ్వర్డ్ను!....వేల్స్ యువరాజును! ఈ అనాథ శరణాలయం అధి ారి ఎక్కడ?.... చప్పున వెళ్ళి అతణ్ని నా సమక్షానికి తీసుకురండి!" అన్నాడు ువరాజు హుందాగా.

పిల్లలంతా ఒక్క పెట్టున బిగ్గరగా నవ్వుతూ చప్పట్లు కొట్టారు.



రక్షకభటులచేత బయటికి వెళ్ళగొట్టబడిన యువరాజు లండన్లో వున్న ఓ చర్చి వద్దకు వచ్చుట.

"ఒరే ముష్టియువరాజా!.... మహారాజుగారి తరఫున ఏదైనా ముఖ్యమైన ర్త తెచ్చావా?" అన్నాడు ఓ కుర్రవాడు నవ్వుతూ.

యువరాజుకు కోపం వచ్చింది. అలవాటు ప్రకారం కుడిచేయి మొలనున్న డ్గం మీదికి వెళ్ళింది. అయితే అక్కడ ఖడ్గం ఉంటే కదా!

"వీడెవడో కానీ, యువరాజుగారి వలె చక్కగా నటిస్తున్నాడు కదు
అన్నాడు మరొక కుర్రవాడు.

"మీరు నన్ను అవమానిస్తున్నారు. దీని ఫలితం ఎలా ఉంటుందో తెలుసా
....మీరంతా మా నాన్నగారి దయా ధర్మంమీద ఆధారపడి యిక్కడ యింత మ
తింటున్నారు. యువరాజుగా నేను యీ శరణాలయాన్ని మూసేయించగల
అప్పుడు మీరంతా వీధుల్లో అడుక్కు తింటారు" అన్నాడు యువరాజు కోపంగా.

పిల్లలు ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు. తర్వాత అందరూ మోకా
మీద వంగి యువరాజుకు గౌరవసూచకంగా నమస్కరించారు. యువరాజుకు ఎం
సంతోషం కలిగింది.

తర్వాత పిల్లలంతా ఒక్కుదుటున లేచారు. అందరూ కలిసి యువరా
మీదికి దాడి చేసారు. పాపం! యువరాజు నేలమీద వెల్లకిలా పడిపోయాడు. తర్వా
పిల్లలంతా పెద్దగా అరుస్తూ ఎక్కడివారక్కడ వెళ్ళిపోయారు.

యువరాజు శరీరమంతా మట్టికొట్టుకుపోయింది. మోకాలికున్న గాయ
పుళ్ళి రేగింది. నెమ్మదిగా లేచి కుంటుకుంటూ ముందుకు బయలుదేరాడు.

'ఇలా లాభంలేదు. ఓఫల్ కోర్టు ఎక్కడో తెలుసుకుని అక్కడికి వెళ్తా
ఆ అడుక్కునే కుర్రవాడి తల్లిదండ్రులను కలుసుకుంటాను. దానితో యీ సమ
పరిష్కారమవుతుంది' అనుకున్నాడు యువరాజు.

యువరాజు నెమ్మదిగా ఓఫల్ కోర్టు సమీపానికి వచ్చాడు. ఆ ముష్టివా
ఇల్లు ఎక్కడో యువరాజుకి తెలియలేదు.

అదే సమయంలో ఆ దారినే ఓ తాగుబోతు వెళ్తూ యువరాజుకి క
పించాడు.

యువరాజు వాడి చొక్కా పుచ్చుకుని ఆపి "జాన్ కేంటీ అనే వ్య
ఎక్కడ నివసిస్తున్నాడో నీకేమైనా తెలుసా?" అని అడిగాడు.

ఆ తాగుబోతు వ్యక్తి యువరాజును చూస్తూనే నవ్వి "ఏరా! వళ్ళు
యడంలేదా?.... నువ్వూ తాగుడు అలవాటు చేసుకున్నావా ఏం?.... నేను నీ తం
నిరా!....జాన్ కేంటీని! నన్ను పట్టుకుని జాన్ కేంటీ యిల్లెక్కడ అని అడుగుతావ
కళ్ళు నెత్తికెక్కాయట్రా నీకు?" అన్నాడు.

"ఓహ్హో! నువ్వేనా టామ్ తండ్రివి!....సరే, నన్ను నా తండ్రి దగ్గరకు ర
భవనానికి తీసుకువెళ్ళు. మా నాన్న ఎవరో తెలుసా? ఈ రాజ్యానికి చక్రవర్తి!.

హెన్రీ VIII! మా నాన్నగారితో చెప్పి మీ దరిద్రం పోయేటట్టు బోలెడంత ధనం ఇప్పిస్తాను'' అన్నాడు యువరాజు.

జాన్ కేంటీ బిగ్గరగా నవ్వుతూ ''ఏరా, తాగిన మైకంలో పిచ్చి పిచ్చిగా మాట్లాడుతున్నావా?.... నేను కూడా ఒక్కొక్కప్పుడు అలాగే మాట్లాడుతూ ఉంటాలే!.... ఇంటికి పద! నాయనమ్మ కర్రతో నాలుగు దెబ్బలు తిన్నావంటే



యువరాజు జాన్ కేంటీని ఆపుజేసి, 'జాన్ కేంటీ ఇల్లెక్కడ?' అని అడిగితే కన్నతండ్రినే అలా అడుగుతావా? అని జాన్ కేంటీ యువరాజును ఇంటికి లాక్కుని వెళ్ళుట!....

తాగుడు మైకం, పిచ్చివాగుడూ రెండూ పారిపోతాయి! పద ఇంటికి!'' అంటూ యువరాజు చొక్కా పుచ్చుకుని, లాక్కుంటూ ఇంటిదారి పట్టాడు.

## 4

యువరాజు ఏకాంత మందిరంలో కూర్చున్న టామ్ ఎన్నో అందమైన

పగటికలలు కనసాగేడు. అద్దంలో తన ఆకారాన్ని చూసుకున్నాడు. మొలను ఖడ్గాన్ని చర్రున ఒరనుండి లాగి దానిని గాలిలో అటు యిటు తిప్పాడు. మ ఖడ్గాన్ని ఒరలో పెట్టేసి అద్దం ముందుకొచ్చి తన యువరాజు వేషాన్ని చూ కున్నాడు.

'ఇప్పుడు ఓఫల్ కోర్టు వద్దవున్న మా పేదవాళ్ళంతా వచ్చినన్ను చూ ఎంత హొంగిపోతారో. నాకెంత అదృష్టం పట్టిందోనని మురిసిపోతారో కదా!' అ కున్నాడు టామ్.

అతడు ఆ గదిలో చాలాసేపు ఏకాంతంగా గడిపాడు. అలా ఒంటరి ఉండటం టామ్‌కి విసుగు పుట్టించింది.

"ఎక్కడికిపోయాడు ఈ యువరాజు? ఎంతసేపని నేను యీ గది ఉండను. యువరాజు ఉంటే సరదాగా మాట్లాడుకుంటూ ఉండేవాళ్ళం కద అనుకున్నాడు టామ్.

వెంటనే అతడు తలుపులు తెరుచుకుని యివతలికి వచ్చాడు. అక్క నిలుచుని ఉన్న సేవకులు టామ్‌ని చూస్తూనే కొద్దిగా నేలకువంగి శిరసులు వ నమస్కరించారు. ఆ సేవకులు వేసుకున్న బట్టలవంక చూసాడు టామ్!.... వా బట్టలు చాలా అందంగా ఉన్నాయి.

"వీళ్ళు నా వంటి ముష్టివెధవకు నమస్కరించడమేమిటి? బహుశా న వెక్కిరిస్తున్నారేమో! యువరాజు వచ్చిన తర్వాత వీళ్ళమీద తప్పక ఫిరా చేయాలి!" అనుకున్నాడు టామ్.

అంతలో ఓ పిల్లవాడు అక్కడికి వచ్చి, టామ్‌కి శిరసువంచి నమస్కరి "యువరాజులకు జయము! జయము! మీ సోదరీమణులవారు జేన్‌గ్రేవారు న్నారు." అని చెప్పాడు.

అప్పుడే అక్కడికి చేరుకున్న యువరాణి జేన్‌గ్రే "యువరాజులక నలతగా ఉన్నట్టు కనిపిస్తున్నారు. ఆరోగ్యం బాగుండలేదా?" అని ప్రశ్నించింది

టామ్ ఆశ్చర్యపోతూ "మీరు పొరబడుతున్నారు. నేను యువరా కాదు. నా పేరు టామ్‌కేంటీ, నేను ఉండేది ఓఫల్ కోర్టువద్ద!.... ఏరీ యువరా వారు ఎక్కడ? వారు నా చింకి బట్టలు ధరించారు. వాటిని నాకు యిచ్చేయ చెప్పండి!.... నేను మా ఇంటికి వెళ్ళిపోతాను." అంటూ నేలకంటా వంగి ర రాణికి నమస్కరించాడు.

జేన్‌గ్రే ఎంతో ఆశ్చర్యపోయింది. తన కజిన్ సోదరుడైన యువరాజు ఎడ్వర్డ్ ఎన్నడూ ఎవరిముందూ అలా మోకాళ్ళ మీద కూర్చుని శిరసువంచి నమస్కరించలేదు. అదీగాక యువరాజు మాట్లాడే మాటలు ఆమెకు భయాన్ని కలిగించాయి.



'నేను యువరాజును కాదు. ముష్టివాడిని' అంటున్న టామ్‌కి పిచ్చి పట్టిందని అందరూ భావిస్తారు. మహారాజు అది విని యువరాజును తన శయన మందిరానికి పిలిపించుట

ఆమె చప్పున వెనుదిరిగి పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయింది ఆ విషయాన్ని మహారాణీ వారికి చెప్పడానికి!....

యువరాజా వారికి పిచ్చి పట్టిన విషయం చిటికెలో రాజభవనం యావత్తూ దావానలంలాగ వ్యాపించింది.

రాజభవనం వ్యవహారాలు చూసే అధికారి అంతఃపురంలో యిలా ప్రకట జారీ చేయించాడు. "మహారాజుగారి ఆజ్ఞను అనుసరించి రాజభవనంలో ఉన్నవా వ్వరూ యువరాజావారి అనారోగ్యం గురించి ఎక్కడా పల్లెత్తు మాట ఉచ్ఛరిం డానికి వీల్లేదు."

టామ్‌కి మతిపోయినంత పనైంది. తనమాటలు ఎవరూ నమ్మడంలేద పైగా అందరూ తనకు పిచ్చిపట్టినట్టు భావిస్తున్నారు అనుకున్నాడు.

ఎక్కడికి వెళ్ళినా సేవకులు సంతోషంగా నమస్కరించడంలేదు. వా ముఖాల్లో విషాదం తొంగి చూస్తూ ఉండటం టామ్ గమనిస్తూనే ఉన్నాడు.

రాజభవనం తాలూకు అధికారులు టామ్‌ని తీసుకుని మహారాజు శయ మందిరానికి వచ్చారు. కొన్నాళ్ళుగా హెన్రీ VIII అస్వస్థులుగా ఉన్నారు. మంచ మీదినుండి లేవడంలేదు.

"యువరాజా వారు ఇటువంటి తెలివితక్కువ హాస్యాలు చేస్తున్నారేమిటి ఎందుకిలా చేస్తున్నావు కుమారా?" అడిగాడు మహారాజు.

మహారాజుముందు ఏం మాట్లాడాలో ఎలామాట్లాడాలో తెలియని టా మౌనముద్రవహించాడు. మహారాజు బాధపడుతూ కొడుకుని దగ్గరకు రావ సిందిగా సంజ్ఞ చేసాడు.

టామ్ దగ్గరకు రాగానే అతణ్ని చేయిపుచ్చుకుని గుండెలకు హ కుంటూ "నాయనా నేను ముసలివాడినయ్యాను. రోగంతో మంచానపడ్డాను. వయసులో నన్నెందుకు బాధపెడతావు చెప్పు? అసలు నీ ఉద్దేశమేమిటో చెప్పు? అన్నాడు మహారాజు హెన్రీ VIII

"నేను భిక్షమెత్తుకుని జీవించే ముష్టివాడిని మహారాజా! ఒక విచి పరిస్థితుల్లో యిక్కడికి రావలసివచ్చింది. ఇది నేను తెలిసిచేసిన నేరంకాదు. తను నా ప్రాణాలను కాపాడండి మహారాజా!" అన్నాడు టామ్ విచారంగా.

మహారాజుకు ఏమీ అర్థం కాలేదు. అతడు ఎంతో ఆవేదన పొందాడు.

అతడు తక్షణం అధికారులను పిలిచి "యువరాజావారికి కొద్దిగా మానసి మైన రుగ్మతవచ్చింది. వారికి వినోదాలూ ఆటలు మంచి మంచి కార్యక్రమాల చూపించడంవల్ల ఆరుగ్మతయిట్టే నయమవుతుంది. అలా చేయండి! యువరా వారికి స్వస్థత చేకూరాలి. అది మీ బాధ్యత. ఇతడు ఇంగ్లండ్ దేశానికి వారసుడ

కాబోయే మహారాజు యువరాజా వారి విషయంలో ఎక్కువ శ్రద్ధతీసుకోండి!" అంటూ ఆజ్ఞాపించాడు మహారాజు.

## 5

టామ్ పరిస్థితి పంజరంలోని చిలుకమాదిరిగా అయిపోయింది. అధికారులు అతడిని ఎక్కడికీ వెళ్ళనీయడంలేదు. అతడికి ఏది ఎలా చేయాలో ఎవరికి ఎలా సమాధానం చెప్పాలో అన్నగుర్తు చేయడానికి ప్రయత్నిస్తున్నారు. టామ్‌వద్ద ఎప్పుడూ సేవకులు కనిపెట్టుకుని వుండసాగేరు.

తన బూట్లు విప్పుకోడానికిగానీ తన బట్టలు విప్పి ఉతికిన వస్త్రాలు ధరించ డానికిగానీ టామ్‌కి స్వేచ్ఛలేదు. చేసేభోజనం కూడా అధికారుల యిష్టా యిష్టాల మీద చేయవలసిందే!

తను ఏది తినాలన్నా దానిని ముందుగా ఓ అధికారి రుచిచూస్తాడు దానిలో విషం కలుపబడలేదని నిర్ధారణ అయిన తర్వాతనే దానిని యువరాజు తినాలి.

యువరాజు విషయంలో అంతఃపురంలోని రాజకీయోద్యోగులు తలకొక రకంగా అనుకోసాగేరు.

"యువరాజు ఒక్కడుకాదు. ఇద్దరు కవలపిల్లలై ఉంటారు. అందులో ఒకడు తప్పిపోయి ముష్టివాడుగా మారిపోయాడేమో! ఈ యువరాజు ఆ ముష్టి వాడేమో! అందుకే అలా మాట్లాడుతున్నాడేమో!" అనేవాడు ఒకడు.

"ఇదేదో మహాద్భుతంగానేవుంది! యువరాజు ఏమిటి తాను ముష్టివాడినని చెప్పడమేమిటి?" అని మరొకడు అనేవాడు.

"భవిష్యత్తు చాలా గడ్డుగానే వుండవచ్చు! ఈ ఇంగ్లండ్ సింహాసనానికి ఏదో దుర్దశపట్టింది" అనేవాడు ఇంకొకడు.

"యువరాజు అక్షరాలా మనయువరాజే! అందులో ఎటువంటి సందేహమూ లేదు. ఏదో మానసికరుగ్మత వచ్చివుంటుంది. నిజంగా అతడు ముష్టివాడే అయితే ఇంతరాజభోగం మహారాజ పదవి తన స్వంతం అవుతున్నప్పుడు హాయిగా తిని కూర్చోక నేను ముష్టివాడిని! నన్ను బయటికి పంపేయండి! అని ఎందుకు గెంతు లేస్తాడు?" అనేవాడు వేరొకడు.

"అదీ నిజమే! ఇతడు అక్షరాలా మన యువరాజే!" అనుకున్నారు వాళ్ళు.

ఏది ఏమైనా టామ్ జీవితం బంగారు పంజరంలోని చిలుక మాదిరిగా

అయిపోయింది.

## 6

మహారాజు హెన్రీ VIII నిద్రనుండి ఒక్కుదుటున లేచి కూర్చున్నారు.

"ఏమైంది ప్రభూ?" అని అడిగాడు సేవకుడు.

"నిద్రలో నాకొక కలవచ్చింది. ఆ కలలో నేను చనిపోయానట! అది నిజమేననిపిస్తున్నది. త్వరలోనే నేను చనిపోతాను!" అన్నాడు మహారాజు.



రాజముద్రను తీసుకురావలసిందిగా మహారాజు ఒక లార్డును టామ్‌వద్దకు పంపుట

అదే సమయంలో న్యాయాధికారి అక్కడికి వచ్చి "ప్రభువులకు ప్రణామములు! నార్‌ఫోక్ ప్రభువుమీద, మిగతా మన సామంతులు అనేక నేరారోపణలు చేస్తున్నారు. అతడిని ఉరితీయవలసిందిగా వారి అభ్యర్థన. మన పార్లమెంటు

కూడా అందుకు తన ఆమోదముద్ర వేసింది. ఇక తమ అనుమతి కోసమే ఎదురు చూస్తున్నాము. తమరు ఆర్డరు పేపర్‌మీద రాజముద్ర వేస్తే డ్యూక్ ఆఫ్ నార్‌ఫోక్‌ని ఉరితీస్తాము” అని చెప్పాడు.

మహారాజు ఆర్డరు పేపర్‌మీద ఆమోదముద్ర వేయడానికి రాజముద్ర కోసం అటుయిటు చూసాడు. అయితే మహారాజుకు రాజముద్ర కనిపించలేదు.

అక్కడే ఉన్న లార్డ్ ఒకడు “తమరు రాజముద్రను లోగడ ఒకసారి యువరాజావారికి దాచిపెట్టమని యిచ్చారు.” అంటూ గుర్తు చేసాడు.

“అయితే నువ్వు తక్షణం వెళ్ళి ఆ రాజముద్రికను యువరాజావారిని అడిగి తీసుకురా!” అని లార్డ్‌ను ఆజ్ఞాపించాడు మహారాజు.

లార్డ్ వెళ్ళి టామ్‌ని రాజముద్రిక గురించి అడిగాడు. అప్పటికి టామ్ చదవడం, రాయడం నేర్చుకున్నాడు. అంతఃపురంలో ఎలా ప్రవర్తించాలో, ఎలా మాట్లాడాలో అన్నీ క్షుణ్ణంగా నేర్చుకున్నాడు.

“రాజముద్రికను మేము ఎక్కడ దాచిపెట్టామో జ్ఞాపకం రావడంలేదని, జ్ఞాపకం వస్తూనే రాజముద్రికను పంపుతామనీ మతిమరుపుకు యువరాజావారు క్షమాపణలు కోరుతున్నారనీ ప్రభువులవారితో మనవి చెయ్!” అని టామ్ సమాధానం చెప్పాడు.

యువరాజుకు యింకా స్వస్థత చేకూరనందుకు మహారాజు ఎంతో బాధ పడ్డాడు. రాజముద్రిక లేకపోతే ఆర్డర్ పేపర్‌మీద సంతకం చేయకూడదు. చేసినా దానికి విలువ ఉండదు. ఏం చేయాలి?

మహారాజు చప్పున లేచి కూర్చుని “చూడండి న్యాయాధికారిగారూ! మనం మన సామంతరాజ్యాలకు వెళ్ళినప్పుడు చిన్న రాజముద్రికను తీసుకువెళ్ళేవాళ్ళం కదా! అది ఎక్కడుంటుందో మీకేమైనా జ్ఞాపకముందా?” అని మహారాజు న్యాయాధికారిని ప్రశ్నించాడు.

“అది మన కోశాగారంలో ఉంది ప్రభూ!” అన్నాడు న్యాయాధికారి.

“తక్షణం చిన్న రాజముద్రికను తెప్పించండి. వారెంట్ పేపరుమీద రాజముద్రవేసి సంతకం చేస్తాను. నార్‌ఫోక్ ప్రభువుమీద తక్షణమే చర్య తీసుకోండి!” అన్నాడు మహారాజు.

## 7

జాన్‌కేంటీ యువరాజు చొక్కా పుచ్చుకుని ఇంటికి లాక్కువచ్చాడు

కదా! యువరాజును ఇంటికి తీసుకొచ్చి వేగంగా ఒక్క తోపుతోసాడు. దానితో యువరాజు వెళ్ళి నేలమీద బోర్లాపడ్డాడు. కొడుకుమీద జాన్‌కేంటీ పెద్దగా కేకలు వేస్తూ అసహ్యంగా తిట్టడం ప్రారంభించాడు.

ఇంటిలోనుండి టామ్ అక్కలు అమ్మ యివతలికివచ్చి ఆ దృశ్యాన్ని చూసారు. తాగివచ్చిన తండ్రిని చూస్తూనే ఆడపిల్లలు చెరొక మూల భయంతో



టామ్ నాయనమ్మ కర్ర తీసుకుని యువరాజును కొడుతుండగా
'నన్ను కొట్టవద్దు నేను ఇంగ్లండ్ యువరాజును.' అని ఎడ్వర్డ్ అనుట!

నక్కిపోయారు. టామ్ తల్లి కళ్ళనీళ్ళు పెట్టుకోవడం తప్ప ఏమీ చేయలేక పోయింది.

అంతలో ఎక్కడికో వెళ్ళిన ముసలిది ఇంటికి వచ్చింది. యువరాజుని చూస్తూనే ఉగ్రమూర్తి అయింది. ఆడపిల్లలకంటికి నాయనమ్మ ఓ పెద్ద భూతంలాగ

కనిపించింది. ఆ ముసలిదాని కళ్ళల్లో ద్వేషం తప్ప ఆప్యాయత అనేది కనిపించడం లేదు.

ముసలిది చేతిలోని కర్రపైకెత్తి "ఇంటికి రాకుండా ఎక్కడెక్కడ తిరుగుతున్నావ్? చెబుతావా లేక...." అంది.

"నువ్వు నన్ను కొట్టడానికి వీల్లేదు. ఎందుకో తెలుసా? నేను వేల్స్ యువరాజును!" అన్నాడు.

ఆ మాటలకు ముసలిది నోరువెళ్ళబెట్టింది. జాన్ కేంటీ విరగబడినవ్వడం ప్రారంభించాడు.

టామ్ తల్లి పరిగెత్తుకుంటూ కొడుకు వద్దకొచ్చి "ఒరే నాయనా! ఏమిట్రా ఆ పిచ్చి మాటలు? ఫాదర్ ఆండ్రూగారు యిచ్చిన పుస్తకాలు చదివి ఊహాలోకంలో విహరిస్తున్నావు. నువ్వొక తాగుబోతు కొడుకువనీ మీ నాన్న ఒక దొంగ అనీ ముష్టియెత్తుకుని బ్రతికే ముష్టి మనిషి అనీ మరచిపోకు నాయనా!" అంది ఆప్యాయంగా.

యువరాజు ఆ తల్లి ముఖం వంక జాలిగా చూసాడు. అతడికి తల్లి ప్రేమలోని మాధుర్యం ఎటువంటిదో అవగాహన అయింది.

"కావమ్మా! ఇప్పుడు నీ కొడుకు మా అంతఃపురంలో వున్నాడు. మా నాన్న హెన్రీ VIII మిమ్మల్ని అనుగ్రహిస్తాడు. మీకు బోలెడంత ధనం యిస్తాడు. నువ్వు నా యెడల చూపించిన యీ ఆప్యాయత ఫలితం వృథాపోదు." అన్నాడు యువరాజు.

టామ్ తల్లి చప్పున యువరాజు నోరు తన చేతితో మూస్తూ "గట్టిగా అరవకు నాయనా! నీ మాటలు ఎవరైనా వింటే వెళ్ళి మహారాజుగారితో చెబుతారు. రాజభటులు వచ్చి నిన్ను తీసుకువెళ్ళి రాజద్రోహం నేరం క్రింద ఉరితీస్తారు." అంది.

జాన్ కేంటీ కూతుళ్ళవంక చూస్తూ "ఇంకా అక్కడే కూర్చున్నారేం? ఇలా వచ్చి యువరాజావారి ముందు మోకాళ్ళమీద కూర్చుని గౌరవ వందనం చేయండి!" అంటూ బిగ్గరగా నవ్వడం ప్రారంభించాడు.

"సరే! ఇవ్వాళ నువ్వు సంపాదించిన డబ్బు యిలా ఇవ్వు ఇంటి అద్దె చెల్లించాలి." అన్నాడు జాన్ కేంటీ యువరాజుతో.

యువరాజు శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాడు. జాన్ కేంటీకి ఎక్కడ

లేని ఆగ్రహం ముంచు కొచ్చింది. దగ్గరగా నిలబడి వున్న కూతుళ్ళ చెంపల వాయగొట్టాడు. యువరాజును ఎత్తి గోడకు విసిరికొట్టి బయటికి వెళ్ళిపోయాడు.

యువరాజు ఏడుస్తూ అక్కడే నేలమీదపడి నిద్రపోయాడు. టామ్ తల్లి అతడి వద్దకొచ్చి కూర్చుంది. కొవ్వొత్తి వెలుగులో కొడుకు ముఖం వంక పరీక్షగ చూసింది. ఆమె తల్లి హృదయానికి అతడు తన కొడుకు కాదన్న విషయం అర్థమైంది.



యువరాజు చేయిపుచ్చుకుని వీధిలోకి వచ్చిన జాన్ కేంటీకి ఒకచోట బ్రాందీ పోస్తున్న మనిషి కనిపించడంతో జాన్ కేంటీ యువరాజును విడిచివేయుట

"నా టామ్ ముఖం యీ కుర్రవాడి ముఖం ఒకే పోలికలో ఉండవచ్చు. కానీ యీ కుర్రవాడు నా కొడుకు మాత్రం కాదు. లోకంలో ఒకే పోలికలో యిద్దరు ఉండటం అసంభవం కాదు." అనుకుంది.

'అతడు తన కొడుకా? కాదా?' అని తేల్చుకునేందుకు ఆమె ఒక పరీక్ష పెట్టాలనుకుంది.

టామ్ అయితే ఉదయం లేస్తూనే భయం భయంగా పరిసరప్రాంతాలను చూస్తాడు. రెండు చేతులూ ముందుకు చాచి బద్ధకంగా ఆవులిస్తాడు. ఇంటిలో అలికిడి లేవని తెలుసుకుని ముష్టిగిన్నె చేతబుచ్చుకుని వీధిలోకి పారిపోతాడు.

వెంటనే టామ్ తల్లి కొవ్వొత్తి దీపాన్ని తెచ్చి యువరాజు కళ్ళమీద కాంతి పడేటట్టు చేసింది.

యువరాజు నెమ్మదిగా కళ్ళు తెరిచాడు. అయితే ఆ చూపులో భయంకానీ నిరాశకానీ కనిపించలేదు.

అతడు మళ్ళీ నెమ్మదిగా కళ్ళు మూసుకుని "విలియం! ఎక్కడ ఉన్నావు? లార్డ్స్ అంతా ఎక్కడున్నారు?" అన్నాడు.

టామ్ తల్లి తన పరీక్షను రెండు మూడుసార్లు చేసి ఆ కుర్రవాడు తన కొడుకు కాదని, నిర్ధారణ చేసుకుంది.

"ఎంత మహాద్భుతం!.... ఈ దేశానికి కాబోయే మహారాజు యిక్కడ యీ పూరిగుడిశెలో కటిక నేలమీద నిద్రపోవడమా!.... అయితే టామ్ ఎక్కడున్నాడు?...." ఆమె ఆలోచిస్తూ ఉండిపోయింది.

## 8

"లేవండి! నిద్రలేవండి!...." అన్నకేకలు బయటినుండి వినిపించి జాన్ కేంటీ లేచివెళ్ళి తలుపుతీసాడు.

ఎదురుగా ఫాదర్ఆండ్రూ నిలుచుని "ఏమయ్యా జాన్! నీకేమైనా బుద్ధి ఉందా? లేదా?.... అవతల దేశప్రజలంతా వేల్స్ యువరాజైన ఎడ్వర్డ్ క్షేమంకోసం పూజలు చేస్తూ వినోదాలు వేడుకలు చేసుకుంటుంటే నువ్వు టామ్ని చితకబాదుతూ ఉంటావేమిటి? తండ్రులు కొడుకులను బాధించరాదని యువరాజు ఆజ్ఞాపించాడు. నీ విషయం ఎవరికైనా తెలిసిందో రాజభటులు వచ్చి నిన్ను తీసుకుపోతారు." అని చెప్పాడు.

జాన్ కేంటీకి భయం వేసింది. అటుయిటు చూసాడు. యువరాజు నేలమీద పడుకుని నిద్రపోతున్నాడు. జాన్ గబగబా అక్కడికి వెళ్ళి యువరాజుని అమాంతం లేపి నిలబెట్టి అతడి చేయిపుచ్చుకుని బయటికి యీడ్చుకుపోయాడు. ఓఫల్ కోర్టు దాటి వీధులన్నీదాటి లండన్ బ్రిడ్జ్ సమీపానికి తీసుకొచ్చాడు.

"ఒరే ముష్టి వెధవా! నేను నిన్ను కొడతానని నీ నోటినుంచి ఒక్కమాట అయినా బయటికి వచ్చిందో నీ తాట వొలిచి డోలు కట్టేస్తాను. జాగ్రత్త!" అన్నాడు యువరాజుతో జాన్ కేంటీ.

లండన్ వీధులన్నీ మహా సంపడిగా ఉన్నాయి. జనం నవ్వుతూ కేరింతలు కొడుతూ అటుయిటు తిరుగుతున్నారు. బ్యాండ్ మేళాలూ, పాటలు పాడేవాళ్ళూ, నృత్యాలు చేసేవారూ తమ కళా కౌశలాన్ని చూపిస్తున్నారు.



రాజప్రాసాదం వద్దకొచ్చిన యువరాజు 'నేను యువరాజును' అంటే రక్షకభటులు యువరాజు మెడపుచ్చుకుని గెంటి వేయుట

జాన్ కేంటీ యువరాజు చేయిపుచ్చుకుని జనంలో నుండి ముందుకు తీసుకు పోతున్నాడు. అక్కడ ఒకచోట ఒక వ్యక్తి అందరికీ మత్తుపానీయం గ్లాసులను యిస్తున్నాడు.

"రండి! రండి! నేను రోజూ అందరికీ మంచినీళ్ళు పంచిపెడుతూ ఉంటాను. కానీ యీ రోజు ద్రాక్ష సారాయాన్ని పంచిపెడుతున్నాను. వేల్స్ యువరాజు పేరున యీ రోజు యిష్టంవచ్చినంత తాగండి" అంటున్నాడు ఆ వ్యక్తి.

జాన్‌కేంటీకి నోరూరింది. యువరాజుని పుచ్చుకుని గుంపు లోపలికి వెళ్ళాడు. గ్లాసులు అందుకునే సందడిలో యువరాజు చేయి వదిలేసాడు.

యువరాజుకు అవకాశం చిక్కింది. గుంపును తప్పించుకుని రాజభవనం దిక్కుగా పరుగు ప్రారంభించాడు.

"ఆ ముష్టి వెధవ నా బట్టలు కావాలని అడగకపోతే యింత అనర్థం జరిగి ఉండేది కాదు. వాడు అందరితో నిజం చెప్పకుండా తానే వేల్స్ యువరాజు అయినట్టు అందర్నీ మోసం చేస్తున్నాడు. అపంతా బట్టబయలు చేస్తాను. ఆ రాజద్రోహికి ఉరిశిక్ష విధిస్తాను." అనుకున్నాడు యువరాజు.

చివరకు అతడు రాజప్రాసాదం యొక్క సింహద్వారం చెంతకు చేరుకున్నాడు. సువర్ణద్వారాలకు అటు యిటు ఇద్దరు రాజభటులు కాపలాకాస్తూ కనిపించారు.

"నేనే అసలైన వేల్స్ యువరాజును! అంతఃపురంలో ఉన్నది నకిలీ యువరాజు. నేను మహారాజుగారితో మాట్లాడాలి. గేట్లు తెరవండి!" అన్నాడు యువరాజు దర్పంగా కాపలావాళ్ళతో.

ఒక కాపలావాడు యువరాజుని చూసాడు. వాడికి ఎక్కడలేని కోపమొచ్చింది.

"మళ్ళీ వచ్చావురా రాస్కెల్!.... నిన్నేం చేస్తానో చూడు ముష్టివెధవా!" అంటూ కాపలావాడు యువరాజు మెడపుచ్చుకుని దూరంగా విసిరేసాడు.

దానితో పాపం యువరాజు దూరంగా వెళ్ళి నేలమీద పడ్డాడు. మోకాళ్ళు కొట్టుకుపోయాయి. అక్కడున్న జనం విరగబడి నవ్వడం ప్రారంభించారు. యువరాజు చొక్కా పుచ్చుకుని పైకి లేపారు.

అంతలో బలమైన ఒక వ్యక్తి వాళ్ళమధ్యకు వచ్చాడు. కుడిచేతితో కొంతమందిని, ఎడమ చేతితో కొంతమందిని దూరంగా నెట్టేసి యువరాజును దగ్గరకు తీసుకున్నాడు.

యువరాజు ఆ వ్యక్తి వంక చూసాడు. ఆ వ్యక్తి ఎత్తుగా, బలిష్ఠంగా ఉన్నాడు. మంచి దుస్తులు వేసుకుని ఉన్నాడు. ఉన్నతవంశానికి చెందిన వాడిలా

కనిపించాడు.

ఆ వ్యక్తి యువరాజు ముఖంలోకి చూసి నవ్వుతూ "నా పేరు మైల్స్ హెండన్! నేను నీ స్నేహితుణ్ని!" అన్నాడు.

"అడుగో మరొక యువరాజు.... అతడి సంరక్షకుడు!.... పదండి! వాళ్ళని సన్మానించుదాం!" అంటూ ప్రజలు వాళ్ళమీద విరుచుకు పడడానికి ముందుకొచ్చారు.



నేలమీద పడిన యువరాజును, జనం నుండి మైల్స్ హెండన్ అనేవాడు వచ్చి రక్షించుట.

అదే సమయంలో రాజభటులు ముందుకొచ్చి "తొలగండి! మార్గంయివ్వండి! మహారాజుగారి వద్దనుండి వార్తాహరుడు వస్తున్నాడు. దారి యివ్వండి!" అని బిగ్గరగా అరిచారు.

జనం ఎక్కడి వారక్కడ పైదొలగి వస్తున్న గుర్రపు బగ్గీకి మార్గం యిచ్చారు. ఆ సందడిలో హెండన్ యువరాజు చేయి పుచ్చుకుని పరుగు లంఘించు కున్నాడు.

రాజభవనంలోని గిల్డుహాల్ రాజప్రముఖులతోనూ, ప్రభువులతోనూ' లార్డ్సుతోనూ, నిండివుంది. అందరిముఖాలలోనూ ఆత్రుత ఆందోళనలు కనిపిస్తు న్నాయి.

మరుక్షణం రాయబారి వేదికమీదికొచ్చి "రాజప్రముఖులారా! మీరొక అశుభవార్త చెప్పవలసి వస్తున్నందుకు ఎంతోబాధపడుతున్నాను. మహారాజు హెన్రీ VIII గారు ఇకమనకు లేరు. వారు మరణించారు!" అంటూ ప్రకటించాడు.

ఒకలార్డ్ వచ్చి టామ్ ముందు మోకరిలి "మహారాజుగారు మరణించారు. ఈ ఇంగ్లండ్ సామ్రాజ్యానికి యీ క్షణంనుండి మీరే మహారాజులు! మీ నోటి నుండి వెలువడిన మాటే రాజశాసనం!" అన్నాడు.

టామ్ ఎంతో ఆశ్చర్యపోయాడు!

తర్వాత లార్డ్‌తో యిలా అన్నాడు. "నేను యీ ఇంగ్లండ్ సామ్రాజ్యానికి మహారాజునే అయితే నా నోటి నుండి వెలువడేమాట రాజశాసనమే అయితే....నేను మహారాజును అయిన శుభసందర్భంలో నార్‌ఫోల్ ప్రభువును క్షమించి విడిచి పెట్టాలనుకుంటున్నాను. అతడి ఉరి శిక్షను రద్దు చేయండి!" నా మాట తక్షణం అమలు జరగాలి!"

"చిత్తం! అలాగే జరుగుతుంది!" అన్నాడు లార్డ్.

ఈ వార్త దేశమంతా ప్రాకింది!

'నిరంకుశ దుష్టపాలన అంతమైంది! మనకు దయకల ప్రభువు లంభిం చాడు. ఎడ్వర్డ్ ప్రభువు కలకాలం జీవించాలి. ఇంగ్లండ్ ప్రభువు చల్లగా వర్ధిల్లాలి!' ప్రజలు టామ్‌ని వేనోళ్ళ కీర్తించసాగేరు.

## 9

వేల్స్ యువరాజైన ఎడ్వర్డ్ ఇప్పుడు యువరాజు కాదు. మహారాజు కనుక మనం అతణ్ని మహారాజు అని సంబోధించడమే సమంజసంగా ఉంటుంది.

మైల్స్ హెండన్ మహారాజును తీసుకుని లండన్ బ్రిడ్జివద్దకు చేరు కున్నాడు. దారిపొడుగునా ప్రజలు జేజేలు పలుకు తున్నారు.

"మహారాజు ఎనిమిదవ హెన్రీ చనిపోయారు. ఇప్పుడు మన మహారాజు

ఆరవ ఎడ్వర్డ్‌గారు! ....మహారాజు ఎడ్వర్డ్ కలకాలం జీవించాలి!"

ఆ జేజేలు ఎడ్వర్డ్ విన్నాడు. ఆనందంతో అతడి శరీరం ఉప్పొంగింది.

మైల్స్‌హెండన్, ఎడ్వర్డ్ చేయిపుచ్చుకుని లండన్ బ్రిడ్జి మీదుగా వస్తున్నాడు. ఆ బ్రిడ్జి అటు లండన్ నగరానికి యిటు దక్షిణ పార్కుకి మధ్యన వుంది. బ్రిడ్జికి యిరుప్రక్కలా అందమైన దుకాణాలు ఎన్నో వున్నాయి.



'మహారాజు చనిపోగానే టామ్ ఇంగ్లండ్ మహారాజు అవుతాడు

ఒకచోట ప్రశాంత వాతావరణంలో నెలకొన్న ఓ చర్చి వుంది. ఆ చర్చిలో తల్లిదండ్రులే పట్టించుకోని అనాథ పిల్లలు పెరిగి పెద్ద అవుతారు. భిక్షమెత్తుకుని జీవిస్తారు. చివరకు అక్కడే చనిపోతారు. ఎవరు ఎక్కడ ఉన్నారో అక్కడున్నవారందరికీ తెలుసు.

ఎడ్వర్డ్ హెండన్ జనాన్ని తప్పించుకుంటూ హెండన్ హోటల్‌లో

ద్దెకు తీసుకున్నగది వద్దకు వచ్చారు.

అంతలో ఒక వ్యక్తి జనాన్ని తోసుకుంటూ ముందుకొచ్చి ఎడ్వర్డ్ చేయి చ్చుకుని యిలా అన్నాడు. "చివరకు దొరికావు ఈ సారి నిన్ను విడిచిపెడతా నుకోకు!....ఇప్పుడు నా నుంచి తప్పించుకో లేవు."

ఆ వ్యక్తి ఎవరోకాదు టామ్ తండ్రి జాన్‌కేంటీ!

హెండన్ వెనుదిరిగి "ఆ కుర్రవాడిని ముట్టుకున్నా చిన్నపెత్తు బాధ ెగించినా అమాంతం నిన్ను ఎత్తి బ్రిడ్జిక్రిందికి విసిరేస్తాను. జాగ్రత్త" అన్నాడు న్‌కేంటీతో.

"నేను ఈ కుర్రవాడి తండ్రిని! నా ఇష్టం ఏమైనా చేసే హక్కు నాకుంది. ధ్యలో నువ్వెవరివి అడగడానికి?" అన్నాడు జాన్‌కేంటీ కోపంగా.

"ఓహో! అలాగా! నీ వంటి తండ్రి దగ్గర ఉండటం కంటే ఇతడు చిపోవడమే మంచిదిసుమా!.... సరే! ఇక నీ దారిన వెళ్ళు. కుర్రవాడి విషయం ర్చిపో!....కాదంటావా?...." హెండన్ గుడ్లురుముతూ చూసాడు.

జాన్‌కేంటీ ఎడ్వర్డ్ చేయి వదిలేసి వాళ్ళను తిడుతూ, శాపనార్థాలు డుతూ వెళ్ళిపోయాడు.

చివరకు వాళ్ళు హోటల్ గదివద్దకు వచ్చారు. గది చాలా మురికిగా సహ్యంగా ఉంది. గదిలోని బల్లలు, కుర్చీలు పాడుపడి ఉన్నాయి. ఆ గదిలో ఒకే క్క మంచం ఉంది.

గదిలో అడుగుపెడుతూనే ఎడ్వర్డ్ అలసటతో మంచంమీద పడిపోయి కాళ్ళు ర్లా చాపేసాడు.

"చూడు మిత్రమా! నాకు నిద్ర వస్తోంది. భోజనం దార్థాలన్నీ బల్లమీద ర్ధంచేసిన తర్వాత నన్ను నిద్రలేపు!" అని చెప్పి, ఎడ్వర్డ్ గుర్రుపెట్టి నిద్ర ోయాడు.

'ఈ ముష్టివెధవ చూడు! నా మంచంమీద తన్ని పెట్టి పడుకున్నాడు. ఇదేదో ర రాజభవనం అయినట్టూ, తానొక యువరాజునైనట్టూ, ఈ మంచం హంస ూలికా తల్పం అయినట్టూ, నేను యీ వెధవకు సేవకుడినైనట్టూ పగటి కల ంటున్నాడు కాబోలు!' అనుకున్నాడు హెండన్.

అయినా హెండన్‌కు ఆ అందమైన కుర్రవాడిమీద కోపం రాలేదు. ఎంతో ాలి, సానుభూతి కలిగాయి. అతడి ముఖంలోని అమాయకత్వం, స్వచ్ఛత

హెండన్‌కి బాగా నచ్చాయి. అతడిని తన స్వంత తమ్ముడిగా భావించాడు. కుర్రవాడి ముఖంమీద పడుతున్న ముంగురులను ప్రేమగా వెనక్కి తన చేతివ్రేళ్ళతో దువ్వి సరిచేసాడు. కుర్రవాడికి చలిగాలి తగులుతుందేమోనని తన కోటు విప్పి మీద కప్పాడు.



యువరాజు హెండన్‌తో హోటల్ గదికివచ్చి మంచంమీద పడుకుని 'భోజనం సిద్ధంకాగానే లేపు!' అని నిద్రపోవుట.

'వీడిని మా ఇంటికి తీసుకువెళతాను. నేను ఏడు సంవత్సరాల తర్వాత ఇంటికి వెళుతున్నాను. నేను దేశబహిష్కార శిక్ష పొందినవాడిని. నా కుటుంబం అక్కడ క్షేమంగా ఉన్నట్టయితే యీ పిచ్చిముష్టి కుర్రవాడుకూడా మాతోబాటే ఉంటాడు' అనుకున్నాడు హెండన్.

"ప్రభూ! నిద్రలేవండి! భోజనం సిద్ధం చేయబడింది!" అంటూ హెండన్

గ్గరగా అరిచాడు.

ఎడ్వర్డ్ నిద్రలేచాడు. స్నానాల గదిలోకి వెళుతూ "అలా ... హస్తావేం? వచ్చి నాకు స్నానం చేయించు!" అన్నాడు.

హెండన్ నవ్వుకున్నాడు. అతడి ఊహాతీత ప్రవర్తనకు ఆశ్చర్య పోయాడు. నీళ్ళతో అతడికి స్నానం చేయించాడు.

"తుడుచుకునేందుకు తుండుగుడ్డ!" అన్నాడు ఎడ్వర్డ్.

హెండన్ టవల్ తెచ్చి చేతులూ, అవీ తుడిచాడు. ఎడ్వర్డ్ వచ్చి బల్ల దగ్గర కూర్చున్నాడు. హెండన్ ఎగువన కూర్చున్నాడు.

"లేచి నిలబడు!" ఆజ్ఞాపించాడు ఎడ్వర్డ్.

హెండన్ లేచి నిలుచున్నాడు.

"రాజుగారిముందు కూర్చోవడం నేరమని నీకు తెలియదా?" అన్నాడు ఎడ్వర్డ్.

రాచమర్యాదలు, పద్ధతులు గురించి యీ కుర్రవాడికి ఎలా తెలిశాయా అని హెండన్ ఆశ్చర్యపోయాడు. తర్వాత గ్లాసులో ద్రాక్షసారాయంపోసి కుర్రవాడి చేతికిచ్చాడు.

ఎడ్వర్డ్ గ్లాసు అందుకుంటూ "ఆఁ.... ఇప్పుడు చెప్పు? నువ్వు ఎవరు? నీ జీవిత వృత్తాంతమేమిటి?" అడిగాడు ఎడ్వర్డ్ రాజు.

అతడలా ప్రశ్నించగానే హెండన్‌కి తన గత జీవితం మనసులో మెదిలింది.

అప్పుడు హెండన్ తన గాథ యిలా చెప్పడం ప్రారంభించాడు:

"నా తండ్రి ధనవంతుడైన రాజవంశీయుడు. మా ప్రాంతానికి ప్రభువు. అతని పేరు 'సర్ రిచర్డ్ హెండన్' నాకు యిద్దరు సోదరులు ఉన్నారు. ఒకడి పేరు ఆర్థర్, రెండవవాడి పేరు 'హగ్'!.... మా మేనత్త కూతురు గూడ మాతోనే ఉండేది. ఆమె పేరు మేడమ్ 'ఎడిత్' మిస్ ఎడిత్ నేనూ ప్రేమించుకున్నాము. పెళ్ళి చేసుకోవాలనుకున్నాము. అయితే నా సోదరులు ఆర్థర్, హగ్ లు కలిసి వల పన్నారు. ఎడిత్‌కి ధనాశ చూపించారు. ఎడిత్ తనని వివాహం చేసుకునేందుకు అంగీకరించిందని ఆర్థర్ ప్రకటించాడు. వాళ్ళ వివాహం నిశ్చయమైంది. నేను ఎంతో బాధపడ్డాను. ప్రేమను కాలదన్ని, ఎడిత్ డబ్బుకు అమ్ముడు పోయిందని దుఃఖించాను. అయితే నా సోదరులు నన్ను ఆ ప్రాంతంలో ఉండకుండా చేయడానికి ఓ పథకం తయారుచేసారు. నేను ఎడిత్‌ని అపహరించి తీసుకు పోయేందుకు ఏర్పాట్లు

చేశానని సాక్ష్యాధారాలతో మా నాన్నవద్ద నిరూపించారు. మా నాన్నకు నా మీద అగ్రహం వచ్చింది. కొడుకును కాబట్టి ఎటువంటి శిక్ష వేయలేడుకదా!.... కానీ, శిక్ష కాని శిక్ష విధించాడు. సైన్యంతో సహా శత్రురాజు మీదికి యుద్ధానికి పంపించాడు. ఆ యుద్ధంలో నేను ఓడిపోయి వాళ్ళకు ఖైదీగా చిక్కాను. ఏడు సంవత్సరాలు జైలు జీవితం గడిపాను. ఇన్నాళ్ళకు తిరిగి స్వదేశం వెళుతున్నాను. ఈ మధ్య కాలంలో అక్కడ ఏం జరిగిందో ఎవరు ఉన్నారో కూడా నాకు తెలియదు ప్రభూ!"



తనవద్ద ఉన్న సేవకుర్రవాడు తాను యువరాజునని చెబుతున్నాడు. వాడికిమంచి బట్టలు కుట్టియిస్తే బాగుంటుందని హెండన్, ఎడ్వర్డ్‌కు బట్టలు కుట్టుట

అంతా విన్న తర్వాత ఎడ్వర్డ్ "చూడు హెండన్! నా కష్ట కాలంలో బాధలు అనుభవిస్తున్నప్పుడు నన్ను రక్షించావు. దయ చూపించావు. తిరిగి నేను

ంహాసనాన్ని అధిష్టిస్తే నేను నిన్ను విశేష ధనసంపత్తితో బహూకరిస్తాను. నువ్వు
మైతే గతంలో పోగొట్టుకున్నావో అదంతా తిరిగి నీకు వచ్చేటట్టు చేస్తాను.
వ్వంటే నాకెంతో యిష్టంగా ఉంది హెండన్!.... ఈ ఆనంద సమయంలో నీ
రిక ఒకటి తీర్చాలన్న ధృఢ సంకల్పంతో ఉన్నాను. ఏదైనా ఒకటి కోరుకో!"
న్నాడు.

హెండన్ బాగా ఆలోచించి "ప్రభూ! నాది ఒకే ఒక్క కోరిక! నేనూ,
కుటుంబం ఎల్లప్పుడూ మీ ఎదుటనే మీ కళ్ళముందే జీవిత శేషాన్ని గడపాలని
ంది. ఆ అవకాశాన్ని యివ్వండి ప్రభూ!" అన్నాడు.

"అలాగే జరుగుతుంది!" అంటూ మహారాజు హెండన్‌ని తన ముందు
ాకరిల్లమని చెప్పాడు.

హెండన్ అలాగే చేసాడు. ఆ గదిలో వున్న తుప్పుపట్టిన ఖడ్గాన్ని
సికొని ఎడ్వర్డ్ దానిని హెండన్ భుజానికి తాకించాడు.

"పైకిలేచి నిలబడు సర్ మైల్స్ హెండన్! ఈ క్షణం నుండే నువ్వు మా
స్యంలో మహాయోధుడవు! నువ్వు సర్వవేళలా మా సమక్షంలోనే ఉంటావు-"
న్నాడు.

ఆ తర్వాత అతడు తిరిగి మంచంమీద పడుకుని నిద్రపోయాడు.

"ఈ కుర్ర వెధవ నా మంచాన్ని తిరిగి ఆక్రమించుకున్నాడు. పోనీలే
డుకోనీయ్! నేను గుమ్మంవద్ద పడుకుని కాపలాకాస్తాను. వీటిని ఎత్తుకుపోయేందుకు
తి నాన్న ఒకడు ఉన్నాడు కదా! వాడు రాకుండా చూడాలి" అనుకున్నాడు
ాండన్.

"కుర్రవాడు మహారాజులాగ బాగా అభినయిస్తున్నాడు. ఈ వయసు కుర్ర
ళ్ళంతా వీధులలో 'రాజు-దొంగ' ఆటలు ఆడుతూ ఉంటారు కదా! బహుశా వీడు
జుగారి పాత్రపోషిస్తూ ఉండేవాడేమో!.... ఏది ఏమైనా కుర్రవాడి బట్టలు బాగా
ాసిపోయి చిరిగి ఉన్నాయి. మార్కెట్‌కి వెళ్ళి బట్టలుకొని తీసుకురావాలి." అను
న్నాడు హెండన్.

హెండన్ నిద్రలేచాడు. అప్పటికి ఎడ్వర్డ్ నిద్రలేవలేదు. హెండన్ తలుపు
గ్గరగా వేసి మార్కెట్‌కి వెళ్ళాడు.

"నా ప్రభువుకు మంచి రాజసం ఉట్టిపడే వస్త్రం తీసుకోవాలి." అను
న్నాడు హెండన్. ఒక షాపులో ధగధగ మెరుస్తున్న పట్టులాంటి వస్త్రంకొన్నాడు

మరొకచోట సూది, దారం తీసుకున్నాడు. ఆ తర్వాత ఒకచోట కూర్చుని మహా రాజుగారికి దుస్తులు కుట్టడం ప్రారంభించాడు. అలా కుట్టడంలో ఒకసారి సూది హెండన్ చూపుడు వేలులో దిగబడింది. చివరకు ఎలాగై తేనేమి మహారాజుగారికి బట్టలు తయారయ్యాయి.



నీ స్నేహితుడు హెండన్ ప్రమాదానికి గురి అయ్యాడు' అని చెప్పి ఓ వ్యక్తి వచ్చి హోటల్ నుండి ఎడ్వర్డ్‌ని తీసుకు వెళ్ళుట!

'ఫర్వాలేదు. ఆ మురికి బట్టలకన్నా 'యివి కొంతమెరుగు!' వాడి ఒంటి మీదబట్టలు విప్పేసి యివి తొడుగుతానుఅనుకుంటూ హెండన్‌హోటల్ గదికి చేరు కున్నాడు. తలుపులు తెరిచి లోనికొచ్చి చూసాడు.

ఎవరున్నారు అక్కడ? మహారాజులేడు. ఖాళీమంచంబోసిగా కనిపించింది. హెండన్ ఆచుట్టు ప్రక్కలగాలించాడు. అయినా మహారాజు కనిపించలేదు.

హోటల్ మేనేజర్ వద్దకొచ్చి "ఏంప్! మా కుర్రవాడు ఎక్కడ? ఎక్కడికి శ్ళాడో చూశావా?" అని ప్రశ్నించాడు హెండన్.

"మీరు అలా వెళ్ళిన కొంతసేపటికి ఎవడో ఒకవ్యక్తి వచ్చాడు సార్!.... తడు చాలా మొరటుగా ఉన్నాడు. తాగి వున్నాడు. గదిలోపలికి వెళ్ళాడు. ద్ది సేపటికి కుర్రవాడి చేయిపుచ్చుకుని బయటికి తీసుకొచ్చాడు. విసురుగా ద్దరూ వీధిలోకి వెళ్ళిపోయారు. నాకు ఏదో అనుమానం వేసి వాళ్ళు ఎక్కడికి ళ్తారో చూద్దామని వాళ్ళను అనుసరించాను. వాళ్ళు బ్రిడ్జి ఎక్కారు. నేనుకూడా ్రిడ్జి ఎక్కాను. అయితే బ్రిడ్జిమీద నడుస్తున్న జనసమూహంలో కలిసిపోయి నిపించకుండా పోయారు అన్నాడు హోటల్ మేనేజర్.

తన చిన్నపిచ్చి మహారాజును అతడి తండ్రి తీసుకుపోయిన సంగతి లుసుకున్న హెండన్ చాలా బాధపడ్డాడు. ఎక్కడైనా వాళ్ళు కనిపిస్తారేమోనని హెండన్ లండన్ బ్రిడ్జి దిక్కుగా పరుగుతీసాడు.

## 10

టామ్‌ని రాజదుస్తులతో సర్వాలంకారాలతో ముస్తాబు చేసారు. రాజ ప్రముఖుల మధ్యన నడుస్తూ టామ్ ఒక పెద్ద హాలులోనికి వచ్చాడు. అక్కడ ఎత్తైన ప్రదేశంలో రాజ సింహాసనం వుంది.

టామ్ సింహాసనం మీద కూర్చున్నాడు. లార్డ్ హెర్ట్‌ఫోర్డు టామ్‌కి అన్ని విధాల సహకరించడానికి సింహాసనం ప్రక్కగా నిలుచుని వున్నాడు. అతని చేతిలో ఎన్నో కాగితాలు వున్నాయి. రాజకీయ వ్యవహారాలకూ సామంత రాజ్యాల జమా ఖర్చుల వ్యవహారాలకూ రాజ్యం యొక్క ఆదాయ వ్యయాలకు ప్రజల కష్ట సుఖాలకు సంబంధించిన అనేక విధాలైన కాగితాలను టామ్ ఆ రోజు పరిష్కరించ వలసి వుంది.

లార్డ్ హెర్డ్‌ఫోర్డు ఏవేవో చదువుతున్నాడు. అతను చదువుతున్న విషయా లలో ఏ ఒక్కటి గూడ టామ్‌కి అర్థం కాలేదు. అయితే ఒకచోట కర్మకాండ (చనిపోయిన వారికి చేసే ఉత్తర క్రియలు) అనే మాట లార్డుహెర్డుఫోర్డు చదువు తున్నప్పుడు వచ్చింది.

ఏదో ఒకటి మాట్లాడాలి కనుక "అయితే కీర్తిశేషులైన మహారాజుగారి కర్మకాండ ఎప్పుడు?" అని టామ్ నెమ్మదిగా అడిగాడు.

"ఈ నెల పదహారవతారీఖున ప్రభూ!" అని సమాధానం చెప్పాడు

లార్డు హెర్డుఫోర్డు.

"అంతవరకు శవంకుళ్ళిపోకుండా ఉంటుందా?" అన్నాడు టామ్.

లార్డు హెర్డుఫోర్డు టామ్ చొక్కా పుచ్చుకుని ఎవరూ చూడకుండా లాగాడు. 'అలా మాట్లాడకూడదు. తప్పు!' అన్నట్టు సంజ్ఞ చేసాడు.

ఆ తర్వాత రాజ్య వ్యవహారాలు చూసే కార్యదర్శి రాజ్యానికి ధించిన ఖర్చులను చదివి వినిపించాడు. అతడు చదివి వినిపించిన దాని ప్ర బొక్కసంలో డబ్బు లేదనీ పన్నెండు వందలమంది నౌకర్లకు జీతాలు యివ్వ తేలింది.

టామ్ ఆలోచించి యిలా అన్నాడు. "మనకు యింత పెద్ద రాజ దేనికి? ఉండే ఇల్లు ఎంత చిన్నదైతే నౌకర్లు అంత తక్కువ వుంది సరిపో మనం మరొక చిన్న ఇంటికి మారిపోతే బాగుంటుందికదూ? నాకు తెలిసిన ఒకటి చేపల మార్కెట్ వద్ద వుంది."

మళ్ళీ లార్డు హెర్డుఫోర్డు అసభ్యంగా మాట్లాడకూడదు అని సంజ్ఞచేశా

టామ్ మాటలు విన్నవాళ్ళు అతడికి మానసికమైన రుగ్మత వుంది మనం అంతగా పట్టించుకోగూడదు! అనుకున్నారు.

ఆ తర్వాత స్వర్గీయ మహారాజుగారి వీలునామా చదువబడింది. అం ఏ ప్రాంతానికి ఎవరు ప్రభువులుగా ఉండాలో ఎవరు ఏ పదవులలో ఉండ వీలునామాలో రాయబడి వుంది.

'వీళ్ళందరికోసం, రాజభోగాలకోసం యింతింత డబ్బు ఖర్చుచేయక రాజుగారు తీర్చవలసిన అప్పులన్నిటినీ ముందుగా తీర్చేస్తే బాగుండును క అనుకున్నాడు టామ్.

ఆ వెంటనే టామ్‌కి యింకొక ఆలోచన వచ్చింది.

'ఎవరో ముక్కూమొగం తెలియనివారిని ప్రభువులుగా, రాజప్రముఖుల నియమిస్తున్నాం కదా! అటువంటప్పుడు మా అమ్మను ఓఫల్ కోర్టు ప్రాంతా రాణిగా నియమిస్తే బాగుండును కదా!' అనుకున్నాడు.

అంతలోనే 'ఆఁ.... నా ఈ మహారాజ పదవి శాశ్వతమా ఏమిటి? పదవిమాత్రం ఉంటుందా?' అనుకున్నాడు.

ఆలోచనా సాగరంనుండి ఒడ్డెక్కివచ్చిన టామ్ తనముందు మోక వున్న ఓ కుర్రవాడిని చూసాడు. ఆ పిల్లవాడికి తన ఈడే ఉండటం టా

ఆశ్చర్యం కలిగించింది.

"కుర్రవాడా! పైకిలేచి నిలబడు....! ఇంతకీ ఎవరు నువ్వు?" అడిగాడు టామ్.

ఆ కుర్రవాడు లేచి నిలబడి "నాపేరు హంఫ్రేమారో. నేను మీకు బదులుగా కొరడాదెబ్బలు తినే కుర్రవాడిని ప్రభూ!" అన్నాడు.



టామ్ వయసున్న కుర్రవాడు, అతడిముందు మోకరిల్లి 'యువరాజు తప్పుచేస్తే అతడికి బదులు తను కొరడాదెబ్బలు తినడమే తన ఉద్యోగం' అని చెప్పుట.

టామ్ ఆశ్చర్యపోతూ "నేను యింతకుక్రితం నిన్ను చూడలేదే! నువ్వు యిక్కడ చేసే ఉద్యోగమేమిటి?" అని అడిగాడు.

"రెండురోజులక్రితం, మీరు గ్రీకుభాష మాట్లాడేటప్పుడు తొట్రుపాటు పడ్డారు. అది తప్పుగా భావించిన ఉపాధ్యాయురాలు నన్ను కొరడాతో కొట్టింది.

అంటే మీరుచేసే తప్పులకు నేను శిక్ష అనుభవిస్తూ ఉంటానన్నమాట! నా ఉది అదే ప్రభూ!" అన్నాడు హంఫ్రేమారో.

"ఎంత ఆశ్చర్యకరమైన విషయం....! సిగ్గుపడవలసిన విషయం క ఒకరు చేసిన తప్పుకు మరొకరు శిక్ష అనుభవించడమా!" అంటూ టామ్ ఆ పోయాడు.

"చదువు విషయంలోనేకాదు ప్రభూ! మీరు ఏ విషయంలో పొరబాట్లు నా వీపుమీద కొరడాదెబ్బలు పడతాయి. మీరు మహారాజులు కదా! మిమ దండించే హక్కు మీ తల్లిదండ్రులకుగూడ ఉండదు మహారాజా!" అన హంఫ్రేమార్లో.

"నేను దీనికి అంగీకరించను. భవిష్యత్తులో నా తప్పులకు నేనే కొ దెబ్బలు తింటాను. ఆ విధంగా శాసనం చేస్తాను" అన్నాడు టామ్.

అది వింటూనే ఆ కుర్రవాడు చేతులు జోడించి "ఆ పని మ చేయకండి ప్రభూ! అది నా బ్రతుకుదెరువుమీదనే దెబ్బకొడుతుంది మహారాజ కొరడాదెబ్బలు తినడం నా ఉద్యోగం ప్రభూ! ఆ ఉద్యోగంపోతే నామీద ఆ పడిన నా కుటుంబం గతి ఏం కావాలి చెప్పండి....? ఈ ఉద్యోగం యిప్పుడు పు కాదు ప్రభూ! మా తాతముత్తాతలుకూడా యిదే ఉద్యోగాన్ని మీ తాతముత్తాత చేసారు" అన్నాడు.

టామ్ నవ్వి "అలాగా! అయితే నువ్వు కొరడాదెబ్బల కుర్రవాడి ఉండు. నీ ఉద్యోగం శాశ్వతం! అయితే నేను తప్పులు చేయకుండా జా పడతాను" అన్నాడు.

ఆ కుర్రవాడు తలవంచి టామ్‌కి సంతోషపూర్వకంగా నమస్క వెళ్ళిపోయాడు.

## 11

టామ్ అన్ని విషయాలు నేర్చుకున్నాడు. రాజకీయ వ్యవహార స్వయంగా చక్కదిద్దుకోగలుగుతున్నాడు. మహారాజ హుందాతనాన్ని ప్రముఖులముందు ప్రదర్శించగలుగుతున్నాడు. ఇతరదేశాల రాయబారులతో మాట్లాడాలో, ఎవరిని ఎలా సన్మానించాలో అన్నీ నేర్చుకున్నాడు.

ఒకనాడు టామ్ తన శయనమందిరంలో కూర్చుని అద్దాల కిటికీగు దూరంగా కనిపిస్తున్న వీధిలోకి చూడసాగేడు. వీధిలో నడుస్తున్న జనం అ

స్వేచ్ఛాజీవులుగా కనిపించారు.

'అవును! వాళ్ళకున్న స్వేచ్ఛ తనకెక్కడిది? ఈ రాజాంతఃపురం తనకొక్క బంగారు పంజరం!.... ఎడ్వర్డ్ మహారాజు ఎక్కడ ఉన్నాడో! తన తండ్రితో ఎనిక బాధలు పడుతున్నాడో! ఎన్ని దెబ్బలు, తన్నులు తింటున్నాడో!.... ఈ మహారాజు జీవితం కన్నా ఆ ముష్టి జీవితమే ఎంతో సుఖప్రదమైనది. ఇది బానిస బ్రతుకు! అది స్వేచ్ఛగా జీవించే ఆనందమయ జీవితం' అనుకున్నాడు టామ్.

అంతలో టామ్‌కి, వీధిలో చప్పట్లు, కేరింతలు కొడుతూ వెళుతున్న గుంపు ఒకటి కనిపించింది.

అదేమిటో తెలుసుకోవాలనుకున్న టామ్ దగ్గరగా ఉన్న లార్డ్‌తో "వీదిలో పోతున్న ఆ గుంపు ఏమిటి?" అని అడిగాడు.

"ఏం లేదు ప్రభూ!.... తమరు మహారాజు అయిన శుభసందర్భాన వాళ్ళు మిమ్మల్ని పొగుడుతూ, జయజయధ్వానాలు చేస్తూ వెళుతున్నారు" అన్నాడు లార్డ్ వినయంగా.

పొగడ్తలకు ఉబ్బిపోయే రాజవంశంలో పుట్టినవాడు కాదు టామ్.

"మీ ఊహ కట్టిపెట్టి అదేమిటో, వాళ్ళ సంతోషానికి కారణమేమిటో తెలుసుకు రమ్మని గార్డులను పంపించండి!" అన్నాడు టామ్ గంభీరంగా.

లార్డ్ వెంటనే బయటికి వెళ్ళి గార్డులతో చెప్పాడు. గార్డులు వెళ్ళి గుంపును ఆపుజేసి విషయమేమిటని అడిగారు.

ఆ గుంపు మధ్యగా ఒక మగవాడు, ఒక ఆడది, ఆమె కూతురు ఉన్నారు. వాళ్ళను రక్షకభటులు తీసుకువెళుతున్నారు.

"వీళ్ళు నేరస్థులు! వీళ్ళను జైలుకు తీసుకువెళ్తున్నారు" అన్నారు కొంత మంది.

గార్డులు తిరిగివచ్చి ఆ విషయాన్ని టామ్‌కి మనవి చేసారు. ఆ నేరస్థులను రాజభవనంలోకి తీసుకురావలసిందిగా టామ్ రాజభటుల్లకు ఆజ్ఞలు జారీ చేసాడు. తక్షణం రాజభటులు వీధిలోకి వెళ్ళి ఆ ముగ్గుర్నీ తీసుకొచ్చి మహారాజు ముందు నిలుచుండబెట్టారు. అదేమిటో చూద్దామని సభాసదులు, రాజప్రముఖులు అక్కడ హాజరు అయ్యారు.

టామ్ ఆ వ్యక్తి ముఖం వంక పరీక్షగా చూసాడు!— ఆ ముఖం ఎక్కడో చూసిన జ్ఞాపకం వచ్చింది టామ్‌కి!—

'అవును!.... ఒకసారి మా కుర్రవాళ్ళమంతా థేమ్సు నదిలో స్నానం చేస్తున్నాము. నా స్నేహితుడు గిలెస్‌వాట్ అకస్మాత్తుగా నదీప్రవాహంలో కొట్టుకుపోసాగేడు. అదే సమయంలో ఈ వ్యక్తి పరుగున వచ్చి నీటిలోకి దూకి, ప్రాణాలకు తెగించి నా స్నేహితుణ్ని రక్షించాడు. అటువంటి మంచి వ్యక్తి నేరం చేస్తాడా? ఒక వ్యక్తిని హత్య చేస్తాడా? నమ్మదగ్గ విషయం కాదు' అనుకున్నాడు టామ్.



పీఠిచెంత తీసుకువెళుతున్న నేరస్థులను తన సమక్షానికి పిలిపించి, టామ్ వాళ్ళ నేరాలను విచారించుట.

"ఈ వ్యక్తి చేసిన నేరం ఏమిటి?" టామ్ అడిగాడు.

"ఒక వ్యక్తి నిద్రపోతుంటే అతడి నోట్లో విషం పోసి హత్య చేసాడు ప్రభూ!" అని చెప్పాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్.

"ఎప్పుడు? ఏ తారీఖున యీ సంఘటన జరిగింది?" టామ్ ప్రశ్నించాడు

"ఈ నెల ఒకటవ తారీఖున ఉదయం పది గంటలకు జరిగింది ప్రభూ!" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

టామ్ గుర్తు తెచ్చుకున్నాడు. 'అవును! ఈ వ్యక్తి అదే రోజున ఉదయం పది గంటలకు, థేమ్స్ నదిలో మునిగిపోతున్న తన స్నేహితుడ్ని రక్షించాడు. మరి, ఒకే వ్యక్తి ఒకే సమయంలో రెండు ప్రదేశాలలో ఎలా ఉండగలడు?'

"నువ్వు చెప్పదలుచుకున్నదేమైనా ఉందా?" టామ్ ఆ వ్యక్తిని ప్రశ్నించాడు.

"ఈ నేరం నేను చేయలేదు ప్రభూ! నా శత్రువు ఒకడు, నన్ను ఉరికంబ మెక్కించాలని కుట్ర పన్ని యీ నేరం నా మీదికి నెట్టాడు మహాప్రభూ! వీళ్ళు చెబుతున్న ఆ రోజు, ఉదయం పది గంటలకు, థేమ్స్ నదిలో మునిగిపోతున్న ఓ కుర్రవాడిని రక్షించి, ఇంటికి తీసుకువెళ్ళి ఉపచారాలు అవీ చేసాను" అన్నాడా వ్యక్తి దీన వదనంతో.

"ఈ వ్యక్తి నేరస్థుడు కాడు! తక్షణం విడుదల చేయండి!...." అన్నాడు టామ్.

ఇన్‌స్పెక్టర్ అతడి చేతికి వేసిన సంకెళ్ళను తీసివేసాడు. అక్కడున్న సభాసదులు, రాజప్రముఖులు మహారాజుగారి దయాగుణానికి ఎంతో సంతోషించారు. న్యాయనిర్ణయాన్ని శ్లాఘించారు.

తర్వాత టామ్ యువతి, ఆమె కూతురు ముఖాలవంక చూస్తూ "వీళ్ళు చేసిన నేరాలు ఏమిటి?" అని ఇన్‌స్పెక్టర్‌ని అడిగాడు.

"ఆ యువతి ఒక మాంత్రికురాలు ప్రభూ! తన దుష్టశక్తుల ప్రభావంతో తుఫానులూ, భూకంపాలూ సృష్టిస్తూ ఉంటుంది. 'నా తల్లి మాంత్రికురాలు కాదు. పిచ్చిది!' అని ప్రజలను మభ్యపెడుతూ ఉంటుంది. ఆ మాంత్రికురాలు కాలికి తొడిగిన నైలాను తొడుగు తీయగానే తుఫాను రావడం చూసామని చాలామంది చెబుతున్నారు ప్రభూ!.... అందువల్లనే తల్లికూతుళ్ళు ఇద్దరిమీద నేరారోపణ చేసి జైలుకు తీసుకువెళ్తున్నాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మరి ఆ విధంగా తుఫాను సృష్టించబడినప్పుడు ఈ మాంత్రికురాలు, ఆమె సృష్టించిన తుఫానులో చిక్కుకుని బాధపడలేదా?" అంటూ టామ్ ప్రశ్నించాడు.

"ఎందుకు బాధపడలేదు ప్రభూ! ఆ తుఫానులో ఈమె ఇల్లు కొట్టుకుపోయింది!"

"తను సృష్టించిన తుఫానులో, తన ఇంటినే పోగొట్టుకున్న యువతి, త తాను నష్టం కలిగించుకున్నట్టే కదా!.... ఇది ఎంత ఆశ్చర్యకరమైన విషయం? పిచ్చివాళ్ళైనా అలా చేస్తారా? ఈమె ఆ విధంగా తుఫాను వరదలో తన ఇం పోగొట్టుకున్నది కనుక తన నేరానికి శిక్ష అనుభవించినట్టే కదా!" అన్నాడు టా

అందరూ ఆశ్చర్యంతో నోళ్ళు వెళ్ళబెట్టి చూస్తూ ఉండిపోయారు.

"చూడమ్మా!.... నువ్వు సృష్టించే తుఫాను చూడాలని ఉంది. ఏదీ, నైలాన్ తొడుగు తీసి దుష్టశక్తుల్ని ఆహ్వానించు!" అన్నాడు టామ్.

ఆ యువతి, కాలికి తొడిగిన నైలాన్ తొడుగు తీసేసింది. అయినా ఏ జరుగలేదు.

"పాపం! ఈమె దుష్టశక్తుల ప్రభావం పోగొట్టుకుని ఉంటుంది. కనుక రికి ఎటువంటి భయమూ అవసరంలేదు. వీళ్ళను నిర్దోషులుగా విడుదల చేయం అన్నాడు టామ్.

స్వేచ్ఛను పొందినవాళ్ళు టామ్‌కి మోకరిల్లి తమ దారిన వెళ్ళిపోయార

అక్కడున్న వారంతా మహారాజుగారి న్యాయనిర్ణయానికి ఘనంగా నివా లర్పించారు.

## 12

మైల్స్ హెండన్ హోటల్ గదినుండి మరొక మొరటు మనిషితో బయ దేరిన ఎడ్వర్డ్, లండన్ బ్రిడ్జి దాటి యివతలి వేపుకు చేరుకున్నాడు.

వేగంగా పరిగెత్తుకుంటూ రావడంవల్ల ఎడ్వర్డ్ బాగా అలసిపోయి చోట రొప్పుతూ నిలబడిపోయాడు.

"నేను మహారాజును అయినప్పటి నుండే హెండన్ నన్ను కనిపె చూసుకుంటున్నాడు. హెండన్‌కి ఏదీ జరగకూడదు!" అన్నాడు ఎడ్వర్డ్.

ఎడ్వర్డ్‌ని తీసుకొచ్చిన మొరటు మనిషి కుంటుకుంటూ అతడి వెనుక వచ్చాడు.

"త్వరగా పద! నీ స్నేహితుడు హెండన్ గాయపడి అడవిలోపడి ఉనా డని చెప్పాను కదా!.... నీ స్నేహితుణ్ని తక్షణం చూడాలని ఉంటే వెంట బయలుదేరు!" అన్నాడు కుంటివాడు.

"నా స్నేహితుడు హెండన్‌ని ఎవరు గాయపరచినా సరే వారు దాని తగిన ఫలితం అనుభవిస్తారు." అన్నాడు ఎడ్వర్డ్.

తర్వాత వాళ్ళిద్దరూ సమీపంలో ఉన్న అడవి ప్రాంతానికి చేరుకున్నారు. అక్కడొక అందమైన ఇల్లు ఉంది. ఇద్దరూ ఇంటి లోపలికి వెళ్ళారు. ఆ ఇంటిలో మరొక వ్యక్తి కూర్చుని ఉన్నాడు. అతడి కుడికంటికి ఆకుపచ్చని గుడ్డ పట్టీలాగ కట్టబడి ఉంది. గెడ్డం మాసి ఉంది. జుట్టు చిందరవందరగా ఉంది.



ఆ వ్యక్తి హెండన్‌కు ప్రమాదం జరిగిందని యువరాజును మోసంచేసి జాన్‌కేంటి వద్దకు తీసుకువచ్చుట

"నా స్నేహితుడు హెండన్ ఎక్కడ?" అన్నాడు ఎడ్వర్డ్. ఆ ఇంటి పరిసరాలను కలియజూస్తూ.

"ఇక్కడ నేను తప్ప నీ స్నేహితులెవరూ లేరు!" అన్నాడు కూర్చున్న వ్యక్తి నవ్వుతూ.

"ఏమిటీ మోసం? ఎవరు నువ్వు?" అన్నాడు ఎడ్వర్డ్ కోపంగా.

"నేనా? నేను నీ కన్నతండ్రిని!.... జాన్‌కేంటీని! నువ్వు నన్ను గుర్తుప
లేదా?" అన్నాడా వ్యక్తి కోపంగా.

"ఇక్కడికెలా వచ్చావ్?"

"రావలసివచ్చిందిరా రాస్కెల్! నేనొక హత్యచేసాను. వేషం మార్చుక
యిలా తప్పించుకుని రావలసి వచ్చింది. ఇకమీదట నా పేరు జాన్‌కేంటీకాదు, జా



యువరాజు తిన్నగా వచ్చి దొంగల చేతికి చిక్కాడు!

నీ పేరు టామ్ కాదు. జాన్! ఆ పేరు గుర్తుంచుకో!" అన్నాడు జా

పోయాడు.

జాన్ కేంటీ నవ్వి "భయపడకు! నా కొడుక్కి పిచ్చిపట్టింది" అన్నాడు.

వాళ్ళు దూరంగా వెళ్ళి మాట్లాడుకోసాగేరు. ఎడ్వర్డ్ అటు యిటు చూసాడు. అక్కడ ఎండుగడ్డి పరిచివుంది. ఎడ్వర్డ్ వెళ్ళి దానిమీద కాళ్ళు చాపుకుని మేను వాల్చాడు. అతడికి చిన్నతనంలో తండ్రితో గడిపిన మధురమైన రోజులు జ్ఞాపకం వచ్చాయి.

'మా నాన్న హెన్రీ VIII ప్రజలకు చండశాసనుడు. ఆయనంటే అందరూ భయపడేవారు. కానీ నన్నెంతగానో ప్రేమించేవాడు. మా నాన్న చనిపోయేటప్పుడు దగ్గర లేకపోయాను. అదే బాధగా ఉంటుంది' అలా ఏవేవో ఆలోచించుకుంటూ ఎడ్వర్డ్ నిద్రలోకి జారుకున్నాడు.

వర్షపు చినుకులు ఇంటిపై భాగంనుండి కారుతూ ఎడ్వర్డ్ ముఖంమీద పడగానే అతడికి మెలకువ వచ్చింది. కొద్దిదూరంలో ఎవరో కూర్చుని బిగ్గరగా మాట్లాడుతుండటం ఎడ్వర్డ్ కి వినిపించి తలతిప్పి చూసాడు.

అక్కడ ఒకచోట పెద్దమంట వేసి ఉంది. మంటచుట్టూ చాలామంది కూర్చుని ఉన్నారు. వాళ్ళల్లో స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ, ముసలివాళ్ళూ ఉన్నారు.

సరిగా నడవలేని బలహీనులూ, అంగవైకల్యం కలవాళ్ళూ, కర్రల సహాయంతో నడిచే కుంటివాళ్ళూ, తమ కుక్కల మార్గదర్శకత్వంలో మందులు అమ్ముకునే గ్రుడ్డివారూ, చంటిపిల్లల తల్లులూ వాళ్ళలో ఉన్నారు. ఏది ఏమైనా వాళ్ళంతా ముష్టివాళ్ళే!

అకస్మాత్తుగా అక్కడి వాతావరణం మారిపోయింది. బ్రాందీసీసాలు బయటికి వచ్చాయి. గ్లాసులు నిండిపోయాయి. కేకలు, పెడబొబ్బలు, నవ్వులూ, కేరింతలూ అధికమయ్యాయి. వాళ్ళు మైకంలో యిష్టంవచ్చిన పాటలు పాడటం ప్రారంభించారు. గ్రుడ్డివాళ్ళు తమ తమ కళ్ళకుకట్టిన ఆకుపచ్చని గంతలు విప్పేసారు. నిజానికి వాళ్ళు గ్రుడ్డివాళ్ళు కాదు. కొంతమంది తమ కొయ్యకాళ్ళను తీసి పక్కనపెట్టి నడుస్తూ గెంతసాగేరు. అంతా లేచి ఒకరిచేతులు మరొకరు పుచ్చుకుని మంటచుట్టూ నృత్యం చేయసాగేరు.

ఈ ఇరవై అయిదుమంది సభ్యులుగల ముష్టి సంఘానికి ఓ నాయకుడు ఉన్నాడు. వాడిపేరే 'రఫ్లర్'!

రఘ్లర్ వాళ్ళతోబాటు కొంతసేపు నృత్యంచేసిన తర్వాత ఫలానా కుటుం వారు ఏమయ్యారంటూ ప్రశ్నించాడు.

"ఆ కుటుంబంలోని కుర్రవాడు వీధి దెబ్బలాటలో చంపబడ్డాడు. ఆ తల్లిని ప్రజలు మంత్రగత్తె అన్న సాకుతో రాళ్ళతోకొట్టిచంపేశారు" అన్నారెవ

ముఠా సభ్యులలో నిరాశా, నిస్పృహలు ఆవరించి అంతా నిశ్శబ్ద ఉండిపోయారు. వాళ్ళను ఉత్సాహపరచడానికి రఫ్లర్ మరి రెండు బ్రాందీసీసా యిచ్చాడు.

తర్వాత వాళ్ళు తమ తమ బాధామయ గాధల్ని ముచ్చటించుకోసాగే

"నాకు మంచి పొలం వుండేది. మా కుటుంబం పొలంమీద వ ఆదాయంతో ఎంతో హాయిగా బ్రతికేవాళ్ళం. అయితే మేము ఆనందంగా ఉండ ధనవంతులైన కులీనులు చూడలేకపోయారు. బలవంతంగా మా పొలాన్ని లాక న్నారు. మమ్మల్ని చిత్రహింసలపాలు చేసారు. నేను వాళ్ళ బాధపడలేక పారిపో వచ్చాను. బ్రతుకుతెరువు కనిపించక యిలా ముష్టివాడిగామారి అడుక్కుంటున్నా అని చెప్పాడు.

"మా ప్రాంతంలోని కులీనులు కూడా మా యెడల క్రూరంగా ప్రవ చారు. అందమైన మా ఆడవాళ్ళను ఎత్తుకు పోయారు. అడ్డం వచ్చిన వారిని న పారేసారు. దొరికిన వాళ్ళను చెట్లకు కట్టి నిర్దాక్షిణ్యంగా వాతలుపెట్టారు. కొర లతో కొట్టారు." అన్నాడు మరొకడు.

ఆ విధంగా కథలు చెప్పుకున్నారు.

'ఇది నిరంకుశ ప్రభుత్వం. ఈ అన్యాయం నశించాలి. సామాన్యుడికై చక్రవర్తికైనా చట్టం ఒక్కటే అయినప్పుడు దేశం బాగుపడుతుంది.' అంట వాళ్ళు ప్రభుత్వాన్ని శాపనార్థాలతో ముంచెత్తారు.

"మనం ముష్టెత్తుకుంటున్నాం. బ్రతుకుతున్నాం. అయినా సరే రా ప్రముఖులు నాకు తెలిసిన చాలామంది మన ముష్టిసోదరులను ఎత్తుకుపో బానిసలుగా అమ్మేసారు. ఇది సహించరాని విషయం" అంటూ గట్టిగా అరి డొకడు.

"భవిష్యత్తులో అలా జరగడానికి వీల్లేదు. అలాచేయకుండా నేను ఇంగ్లీ చట్టాలను సరిదిద్దుతాను. నేను మీకు న్యాయం చేకూర్చుతాను...." ఎడ్వ బిగ్గరగా అన్నాడు.

రఫ్లర్ ఎడ్వర్డ్‌వంక తిరిగి "చట్టాలను మార్చడానికి నువ్వు ఎవరు?.... పెద్ద మహారాజులాగ మాట్లాడుతున్నావే!" అన్నాడు.

"అవును! నేను ఇంగ్లండ్ మహారాజునే! ఆరవ ఎడ్వర్డును!"

అదివింటూనే అక్కడివారు గుర్రం సకిలింపులూ గాడిద అరుపులూ విరగ బడి నవ్వటాలూ ప్రారంభించారు.

జాన్ కేంటీ అందర్నీ నిశ్శబ్దంగా ఉండమని చెప్పి "ఆ కుర్రవాడు నా కొడుకు. పిచ్చిపట్టింది. కొన్నాళ్ళుగా ఇలాగే వాగుతున్నాడు. అతడి మాటలు పట్టించుకోకండి!" అన్నాడు.

ఎడ్వర్డు. జాన్ కేంటీ వేపు తీక్షణంగా చూస్తూ "ఇంతకు క్రితమే నా ముందు ఒకరిని హత్యచేసినట్టు చెప్పావు. నీ విషయం తర్వాత చూస్తాను. నిన్ను ఉరితీయించకపోతే చూడు!" అన్నాడు కోపంగా.

జాన్ కేంటీ, ఎడ్వర్డువేపు గుడ్లురుముతూ చూసి "ఎంత ధైర్యం నీకు! కన్న తండ్రినే చట్టానికి అప్పగిస్తావా?" అంటూ అతడి దగ్గరకు ఎరిగిదూకి బలంగా చెంపమీద చాచిపెట్టి కొట్టాడు.

ఆ దెబ్బకు ఎడ్వర్డు వెళ్ళి నేలమీద పడ్డాడు. తక్షణం రఫ్లర్ వాళ్ళ మధ్య కొచ్చి జాన్ కేంటీని ఆపుచేసాడు.

"నువ్వు ఒక మహారాజుగా ఊహించుకుని నటించడం మంచిదే! కానీ యిలా చూడు బాబూ అంత కఠినంగా మాట్లాడకూడదు. అలా చూస్తారేమిరా! మన కొత్త ప్రభువు ఆరవ ఎడ్వర్డుగారిని సగౌరవంగా సన్మానించడం మనధర్మం!" అన్నాడు రఫ్లర్.

"మన ప్రభువు కలకాలం వర్ధిల్లుగాక!" అందరూ నవ్వుతూ పెద్ద పెట్టున అరిచారు.

కొందరు ఆకులు గడ్డి తెచ్చి ఎడ్వర్డు నెత్తిమీద కిరీటంలా పెట్టారు. ఒకడు చినిగిపోయిన కోటుతెచ్చి మహారాజు మీద కప్పాడు. మరొకడు కొయ్యకాలు తెచ్చి ఖడ్గంలాగ చేతికిచ్చాడు.

"ఈయన మన మహారాజుగారు! ముష్టి మహారాజుగారు!.... ప్రభూ! మమ్మల్ని మీ కాళ్ళతో తన్ని అనుగ్రహించండి!" అంటూ వేళాకోళం చేయసాగేరు.

ఎడ్వర్డ్‌కి వాళ్ళ అపహాస్యపు మాటలకు చాలా బాధ కలిగింది. అయినా ఏం చేయగలడు?....

## 13

తూరుపు తెల్లవారింది. నేరస్థుల ముఠా నాయకుడైన రఫ్లర్ పెద్దగా ఓ
వేసాడు. తక్షణం అక్కడున్న వారంతా నిద్రలేచారు. లేస్తూనే ఎవరిపనుల్లో వ
నిమగ్నమయ్యారు.

కొంతమంది తమకళ్ళకు ఆకుపచ్చ పట్టీలు వేసుకున్నారు గ్రుడ్డివా
మాదిరిగా! తర్వాత మందుల సంచులు చంకలకు తగిలించుకుని తమకు మా
చూపించే కుక్కలను తీసుకుని నగరాభిముఖంగా బయలుదేరారు.



హ్యూగో అనేవాడు క్రిందపడి అడుక్కుంటూ ఉంటే యువరాజు
అదంతా మోసం నమ్మవద్దు అని అక్కడ మూగిన జనంతో చెప్పుట

మిగిలినవారు తమకాళ్ళకు కొయ్యకాళ్ళు తగిలించుకున్నారు. చేతికర్ర
చంకలలో పెట్టుకుని కుంటుకుంటూ బయలుదేరారు. స్త్రీలు తమ చంటిపిల్లలను తీ

కుని ఇంటి వెలుపలికి వెళ్ళిపోయారు. ముసలివాళ్ళు ముష్టి బొచ్చెలను తీసుకుని బయటికి నడిచారు. వాళ్ళు అందరూ తిరిగి సాయంత్రానికి ఆ ప్రదేశం చేరు కుంటారు.

వాళ్ళంతా కలిసి ఒక చిన్న పట్టణం వద్దకొచ్చారు. అక్కడ అందరూ విడి పోయారు. ఎవరు ఏ ప్రాంతానికి వెళ్ళాలో రఫ్లర్ నిర్ణయించాడు. కొంతమంది అడుక్కుంటారు. మరికొంతమంది దొంగతనాలు చేస్తారు. ఇంకొంత మంది ప్రజల్ని మోసం చేసి దోచుకుంటూ ఉంటారు.

వాళ్ళల్లో 'హ్యూగో' అనే మోసగాడు ఉన్నాడు. ఎడ్వర్డ్‌ని వాడి పర్య వేక్షణలో ఉంచాడు రఫ్లర్. వాళ్ళిద్దరూ కొంతసేపు నడకసాగించి పెద్ద రహదారి వద్దకు వచ్చారు.

"నువ్వు ఇప్పుడు పెద్దగా అరవాలి. బాధతో మెలికలు తిరిగిపోతున్నట్టు నటించాలి. అప్పుడు నీ చుట్టూ జనం గుమిగూడుతారు. అదే అదనుగా నేను ప్రజల జేబులు ఖాళీ చేస్తాను. తెలిసిందా? ఊ....బిగ్గరగా కేకలుపెట్టు" హ్యూగో ఎడ్వర్డ్‌తో అన్నాడు.

"ఇతరులను మోసం చేయడం నేరం. చట్టవిరుద్ధం! నేను అలా చేయను." అన్నాడు ఎడ్వర్డ్.

వెంటనే హ్యూగో నేలమీద పడిపోయాడు. మూర్ఛరోగిలా కాళ్లూ చేతులూ కొట్టుకోసాగాడు. జనం గుమిగూడారు. హ్యూగో తన కాలికున్న పెద్దగాయాన్ని ప్రజలకు చూపిస్తూ చేతులు చాచి యాచించడం మొదలుపెట్టాడు. వాడి గాయం ఎర్రరంగుతో తయారు చేయబడింది.

దారి వెంటపోతున్న ఒక సహృదయుడు వాళ్ళదగ్గరగా వచ్చి హ్యూగో పరిస్థితికి ఎంతో జాలిపడ్డాడు.

"అన్నలారా! దయ చూపించండి! అవిటివాడిని. కష్టపడే శక్తిలేదు. ఒక పెన్నీ అయినా ధర్మం చేయండి. లేకపోతే నా కొడుకూ, నేనూ ఆకలితో అలమ టిస్తూ చనిపోతాము. మేము మూడు రోజుల నుండీ పస్తులు ఉంటున్నాము అయ్య లారా!" అంటూ హ్యూగో జాలిగా అన్నాడు.

పాపం! చూడవచ్చిన పెద్దమనిషికి వాళ్ళమీద జాలివేసింది. అతడు జేబులో నుండి కొన్ని నాణేలు తీసి, నేలమీద ఉన్న రఫ్లర్ గిన్నెలో వేసాడు.

అక్కడే నిలబడి అదంతా చూస్తున్న ఎడ్వర్డ్ రఫ్లర్ మోసపు మాటలను

సహించలేకపోయాడు.

"వాడి మాటలు నమ్మకండి. వాడు నా తండ్రికాడు. మీలాంటి మంచి మోసం చేయడమే వాడి వృత్తి. మేము పస్తులతో లేము. ఉదయాన్నే మహా భోజనం చేసివచ్చాము. మీ చేతిలోవున్న కర్రతో వాడి కాలిమీద ఒక్క దెబ్బ కొట్టండి. అక్కడ గాయం ఉందో లేదో మీకే తెలుస్తుంది. అంతేకాదు లేచి నిల్చోలేడు చూడండి" అన్నాడు ఎడ్వర్డ్ బిగ్గరగా.



హ్యూగో నుండి తప్పించుకున్న యువరాజు పారిపోయి వచ్చి ఓ షెడ్‌లో ఆవుదూడ ప్రక్కన పడుకొనుట.

రఫ్లర్‌కి మతిపోయింది. వాడు ఎడ్వర్డ్ ముఖంవంక తీక్షణంగా చూశాడు. నాటేలు ధర్మంచేసిన పెద్దమనిషి చేతిలోని కర్రను పైకెత్తి హ్యూగో మీదికొచ్చాడు. దానితో రఫ్లర్ భయపడి అమాంతం పైకిలేచి జనాన్ని తోసుకుంటు

పరుగు లంఘించుకున్నాడు. మరుక్షణం కనిపించకుండా మాయమయ్యాడు.

ఎడ్వర్డ్ నవ్వుకున్నాడు. ఆ పట్టణమంతా స్వేచ్ఛగా తిరుగుతూ వింతలూ విశేషాలూ చూసాడు. మధ్యాహ్నానికల్లా అతడికి ఆకలి మొదలైంది. 'ఎక్కడైనా ఏదో ఒకటి దొరక్కపోతుందా' అనుకుంటూ అలా నడక సాగించి చీకటిపడే సమయానికి ఒక షెడ్డుపద్దకు చేరుకున్నాడు. మసకచీకటి నల్దిశలా అలుము కుంటున్నది.

ఎడ్వర్డ్ షెడ్‌లోనికి తొంగిచూసాడు. కొంతమంది మనుషులు అక్కడ ఏవో పనిముట్లు తయారుచేస్తూ కనిపించారు. ఎడ్వర్డ్ నీరసపడిపోయి చీకటిలో ఒక మూలగా కూర్చుండిపోయాడు.

కొంతసేపటికి వాళ్ళంతా మూటాముల్లే సర్దుకుని ఇళ్ళకు వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత ఎడ్వర్డ్ నెమ్మదిగా షెడ్‌లోపలికి వెళ్ళాడు. షెడ్ యావత్తూ చీకటిగా వుంది. మసక వెలుతురు మాత్రం కనిపిస్తున్నది. తడుము కుంటూ వెళ్ళి ఒక మూలగా నేలమీద మేనువాల్చాడు. చేతిని ముందుకు చాచాడు. అయితే అతడి చేతికి బిరుసుగావున్న వెంట్రుకలకుచ్చు తగిలింది.

'ఏమిటిది?' అనుకున్నాడు ఎడ్వర్డ్.

ఆ వెంట్రుకలకుచ్చును ఎవరో లాక్కున్నట్టు ఎడ్వర్డ్ చేతిలోనుండి జారి పోయింది. అతడికి కొంచెం భయంవేసింది. కదలక మెదలక అలాగే పడుకున్నాడు.

కొంతసేపు గడిచిన తర్వాత ఆ మొరటు వెంట్రుకలకుచ్చు అమాంతం వచ్చి ఎడ్వర్డ్ ముఖంమీద పడింది. అదేదో దెయ్యం అనుకున్న ఎడ్వర్డ్ భయంతో కెవ్వుమని అరిచాడు.

అంతలో అతడికి సమీపంగా లేగదూడ అరిచిన అరుపు వినిపించింది. మళ్ళీ దాని తోక ఎడ్వర్డు ముఖంమీద పడింది.

"ఓహో! నువ్వు ఆవుదూడవన్నమాట! నాకు ఎవరూ తోడులేరు అను కున్నాను. నువ్వు ఉన్నావన్నమాట!" అన్నాడు ఎడ్వర్డు.

అంతవరకు నిలబడివున్న ఆవుదూడ నెమ్మదిగావచ్చి ఎడ్వర్డు సమీపంగా అతడికి వీపు ఆనించి పడుకుంది. చలితో వణుకుతున్న ఎడ్వర్డుకి కాస్త వెచ్చదనం దొరికింది. అతడు ఎంతో సుఖం దొరికినంత అనుభూతిని పొందాడు. రాజభవనం లోని తన శయ్యా మందిరంలోవున్న హంసతూలికా తల్పంమీద పడుకున్నా అంత సుఖానుభూతిని పొందలేనేమో అనుకున్నాడు ఎడ్వర్డు.

అతడు ఆకలినికూడా మరచిపోయి ఆవుదూడ ప్రక్కన హాయిగా పడు
గాఢనిద్రలో మునిగిపోయాడు.

## 14

సూర్యకిరణాలు ముఖంమీద పడుతూనే ఎడ్వర్డుకి మెలకువ వచ్చి
అతడు కళ్ళు తెరిచి ఆవు దూడకోసం వెదికాడు. అది కొద్దిదూరంలో నిలబడి
మీదవాలుతున్న ఈగల్ని తోకతో తోలుకుంటూ కనిపించింది.

అంతలో తన గుండెలమీద ఏదో కదులుతున్నట్టు అనిపించి ఎడ్వ
చొక్కా ఎత్తి చూసుకున్నాడు. తక్షణం ఎలుక పిల్ల ఒకటి చొక్కానుండి యివత
దూకి పారిపోయింది.

'దీనికి నా [కంపుగొట్టేమురికి బట్టల్లో నిద్రపోవడమే సుఖమనిపించి
కాబోలు' అనుకుని హాయిగా నవ్వుకున్నాడు.

ఎడ్వర్డుకి పైకి లేవాలనిపించలేదు. లేచి మాత్రం ఏం చేయాలి ఏర
కార్యాలు వెలగబెట్టాలి? మళ్ళీ కళ్ళుమూసుకుని ఏవేవో ఆలోచించ సాగేడు.

సూర్యకిరణాల తీక్షణత అధికం కావడంతో ఎడ్వర్డు కళ్ళు తెరిచా
అతడికి ఎదురుగా కొంతమంది పల్లెటూరి పిల్లవాళ్ళు నిలుచుని తననే వింత
చూస్తూ ఉండటం ఎడ్వర్డు కంటబడింది.

ఎడ్వర్డు లేచి కూర్చుని వాళ్ళను చూసి నవ్వాడు. ఎడ్వర్డు అందచందా
ఆ పిల్లలకు ఎంతో సంతోషాన్ని కలిగించాయి.

అందులో వున్న కొంచెం పెద్ద పిల్లలు "ఎవరు నువ్వు? ఎక్కడినుం
వచ్చావు?" అని అడిగారు.

"నేను మహారాజును! ఇంగ్లండ్ మహారాజును!" అన్నాడు ఎడ్వర్డు.

"నువ్వు ఇంగ్లండ్ రాజువా! అయితే చిరిగిపోయిన బట్టలు వేసుకునా
వేమి?.... నీ రాజదుస్తులు ఏమైనాయి? నెత్తిమీద కిరీటం వుండాలికదా! అదేదీ?
కొంతమంది పిల్లలు అమాయకంగా అడిగారు.

"దొంగలు ఎత్తుకుపోతారని కిరీటాన్నీ మాసిపోతాయని రాజ దుస్తుల
రాజభవనంలో వదిలేసి మిమ్మల్ని చూద్దామని యిలా వచ్చాను" అన్నాడు ఎడ్వర్డ

"ఇంగ్లండ్ విడిచిపెట్టి యింతదూరం ఎలారాగలిగావు?" ఓ కుర్రవాడ
ప్రశ్నించాడు.

ఎడ్వర్డు తన వృత్తాంతం యావత్తూ దాచకుండా వాళ్ళతో చెప్పేసాడు

దానితో అతడి మనసు కొంత తేలికపడింది.

మనసులోని కష్టాలు బాధలు మరొకరితో చెప్పుకుంటే హృదయం తేలిక పడుతుంది కదా!....

ఎడ్వర్డు చెప్పింది పిల్లలు శ్రద్ధగా విన్నారు. అతడి గాధను వాళ్ళు నమ్మారు. కొంతమంది పిల్లలు వాళ్ళల్లో వాళ్ళు కూడబలుక్కుని పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయారు.



తెల్లవారి లేచిన యువరాజు చుట్టూ అక్కడి పల్లెటూరి పిల్లలు నిలబడి అతడ్ని వింతగా చూచుట

'ఎంతమంచి హృదయం వీళ్ళది! నా అధికారాలు నాకు తిరిగి వచ్చిన తర్వాత వీళ్ళకు ఏదైనా ఓ మంచి చేస్తాను. ఎవరూ నా మాటలు నమ్మకపోయినా వీళ్ళు నమ్మారు.' అనుకున్నాడు ఎడ్వర్డు.

వెళ్ళిన పిల్లలు, తమ తల్లిని వెంటబెట్టుకు వచ్చారు. ఆమె ఎడ్వర్డ్ను చూసి జాలిపడింది.

"కుర్రవాడు సున్నితంగా, నాజూకుగా, అందంగా ఉన్నాడు. పాప మతిస్థిమితం తప్పినట్టుంది!" అనుకుంది ఆమె.

పిల్లలు ఆమెకు ఎడ్వర్డ్ గురించి అన్ని విషయాలూ ముందే చెప్పారు అయితే అతడు మహారాజు అనే విషయాన్ని ఆమె నమ్మలేదు.

"నీకు గొఱ్ఱెల గురించి కానీ గొఱ్ఱెలపెంపకం గురించి కానీ ఏమైన తెలుసా?" అడిగింది పిల్లలతల్లి.

ఎడ్వర్డ్ శూన్యంలోకి చూస్తూ"గొఱ్ఱెలా అవి ఏమిటి?ఎలా ఉంటాయి?"అన్నాడు అమాయకంగా.

"ఈ కుర్రవాడు రైతు కుటుంబానికి సంబంధించినవాడు కాదు!" అనుకుంది ఆమె.

"మరి కుమ్మరి వాళ్ళ గురించీ కమ్మరి వాళ్ళ గురించీ లేదా నేతనేసేవారి గురించి కానీ, నీకేమైనా తెలుసా? వాళ్ళు చేసేపనులు ఎప్పుడైనా చూసావా?" అని ఆమె ఎడ్వర్డ్ని ప్రశ్నించింది.

ఎడ్వర్డ్ తల అడ్డంగా తిప్పాడు.

"వంటా వార్పూ గురించి తెలుసా?" అడిగింది.

"తెలుసు! అప్పుడప్పుడు నేను పెద్ద పెద్ద విందులు రాజభవనంలో ఏర్పాటు చేసినప్పుడు వంటశాలలోకి వెళ్ళి ఎలా వండుతున్నారో చూస్తూఉంటాను" అన్నాడు ఎడ్వర్డ్.

'ఓహో! అదీ సంగతి! ఈ కుర్రవాడు రాజాంతఃపురంలో వంటలు చేసేవారి వద్ద సహాయకుడిగా పనిచేస్తూ ఉంటాడన్నమాట. పాపం, పిచ్చి ముదిరి యిలా దేశాలుపట్టి తిరుగుతూ ఉండొచ్చు' అనుకుంది ఆమె.

ఆ తర్వాత ఆమె తన పిల్లలతోబాటు ఎడ్వర్డ్ని కూడా ఇంటిలోపలికి తీసుకువెళ్ళింది. మంచి కూరలతో వంట చేసింది. పిల్లలు అందరితోబాటు ఎడ్వర్డ్ని కూర్చొబెట్టి భోజనం వడ్డించింది.

ఎడ్వర్డ్ ఆ రోజు తృప్తిగా భోజనం చేసాడు. భోజనాలు అయిన తర్వాత ఆమె ఎంగిలి గిన్నెలను ఒకచోట వేసి, వాటిని కడిగి తీసుకురమ్మని ఎడ్వర్డ్తో చెప్పింది.

'తను తిన్న కంచాన్ని తన సేవకులు శుభ్రం చేస్తారు. అటువంటిది ఎవరో తిన్న గిన్నెలను తను శుభ్రం చేయడమా!' అనుకున్నాడు.

మళ్ళీ ఏదో ఆలోచించుకుని 'పోనీలే! పెద్దది. తనకింత అన్నంపెట్టి ఆకలి చల్లార్చింది. ఆమె చెప్పిన పనిచేస్తే తప్పేముంది?' అనుకుని ఎడ్వర్డ్ గిన్నెలన్నిటినీ కడిగి, ఉన్ని వస్త్రంతో వాటిని శుభ్రంగా తుడిచిపెట్టాడు.



అడవిలోకి వచ్చిన యువరాజు, రాత్రివేళ దూరంగా కనిపిస్తున్న దీపపు కాంతివేపు బయలుదేరి వెళ్ళుట.

ఈలోగా ఆమె ఎంగిలినంతా ఎత్తి ఓ బుట్టలో వేసింది. ఆ బుట్టను ఎడ్వర్డ్ చేతికిచ్చి "ఈ చెత్తను దూరంగా తీసుకువెళ్ళి పెంటకుప్ప మీద పారేసి రా! తర్వాత ఏం చేయాలో చెబుతాను" అంది.

'ఆ పని మాత్రం నావల్ల కాదు' అని చెబుదామనుకున్న ఎడ్వర్డ్ తలెత్తి

కిటికీ గుండా బయటికి తొంగిచూశాడు. చూస్తూనే, నెత్తిమీద పిడుగు పడినంతగా వణికిపోయాడు.

ఎందుకంటే— జాన్ కేంటీ, హ్యూగో ఆ ఇంటి దిక్కుగా వస్తూ ఎడ్వర్డ్ కి కనిపించారు.

ఇక వెనుకా ముందూ చూడకుండా బట్టను చేత్తో పుచ్చుకుని ఇంటి వెనుక మార్గం గుండా విసురుగా బయటికి వెళ్ళిపోయాడు—

## 15

[illegible] దుష్టశక్తుల చేతికి చిక్కడం మంచిదికాదన్న ఉద్దేశంతో ఎడ్వర్డ్ చిత్తుబట్టను పెంటకుప్పమీద పారేసి, కాలిసత్తువకొద్దీ పరిగెత్తుతూ చివరకు ఓ చిన్న అడవి ప్రాంతానికి చేరుకున్నాడు.

వాళ్ళు తనని చేరుకోలేరని నిర్ధారణ చేసుకున్న తర్వాత, ఎడ్వర్డ్ ఓ బండ రాతిని ఆనుకుని, నేలమీద చతికిలబడ్డాడు.

అడవి వాతావరణం ప్రశాంతంగా ఉంది. చాలా నిశ్శబ్దంగా ఉంది. గాలి వాటుకు చెట్లమీది నుండి వచ్చే బొంగురు శబ్దాలు తప్ప ఏమీ వినిపించడంలేదు. 'అడవిలో ఉన్న దెయ్యాలు అలా అరుస్తున్నాయా! అవి నన్ను దారి తప్పించి యిక్కడికి తీసుకురాలేదు కదా!' అనుకున్నాడు ఎడ్వర్డు.

సాయంత్రం చీకటి పడేవరకూ అక్కడే కూర్చున్నాడు. 'పగటిపూట ప్రయాణం చేస్తే జాన్ కేంటీ తనని పట్టుకుని తీసుకుపోతాడేమో! కనుక రాత్రిపూట ప్రయాణం చేసి అడవి అవతలివైపుకు వెళితే వాళ్ళ వలన తనకు ఎటువంటి భయమూ ఉండదు' అనుకున్నాడు ఎడ్వర్డు.

చీకటి పడింది. అడవి యావత్తూ గాఢాంధకారంలో మునిగిపోయింది. అయితే దూరంగా ఒక చోటునుండి సన్నని వెలుతురు వచ్చి ఎడ్వర్డ్ కళ్ళను తాకింది. అతడికేదో ఆశ తళుక్కున మెరిసింది.

'బహుశా అక్కడ ఎవరో ఒకరు ఉండి ఉండవచ్చు. ఈ రాత్రికి అక్కడ విశ్రమిస్తాను. ఆకలి బాధతీరుతుంది. తెల్లవారకముందే లేచి ప్రయాణం సాగిస్తాను.' అనుకున్న ఎడ్వర్డ్ నెమ్మదిగా లేచి వెలుతురు కనిపిస్తున్న దిక్కుగా బయలు దేరాడు.

చివరకు అతడు వెలుగు సమీపానికి వచ్చాడు. ఆ వెలుగు ఓ పర్ణ కుటీరం నుంచి వస్తున్నది. ఎడ్వర్డ్ చీకటిలో నిలుచుని పర్ణ కుటీరానికి ఉన్న కిటికీ గుండా

లోనికి తొంగి చూసాడు.

పర్ణ కుటీరం లోపల అగ్ని గుండం మండుతూ కనిపించింది. ఆ అగ్ని గుండం ముందు ఓ వృద్ధుడు కళ్ళు మూసుకుని కూర్చుని వున్నాడు. అతడి తల, గెడ్డం, బాగా పెరిగి నేలకు జీరాడుతున్నాయి. వెండ్రుకలు తెల్లగా వెండి జంతారు పోగుల్లా మెరుస్తున్నాయి. ఆ వృద్ధుడి ముందు ఓ చెక్క పెట్టె వుంది. ఆ చెక్క పెట్టె



పర్ణ కుటీరంలోనికి వచ్చిన యువరాజుకు అగ్ని గుండం ముందు కూర్చున్న ఓ వృద్ధుడు కనిపించుట

మీద ఓ పెద్ద పుస్తకం మధ్యకు తెరువబడి వుంది. అతడి ప్రక్కగా భయం గొలిపే మనిషి పుర్రె వుంది. పుస్తకానికి సమీపంగా పెద్ద కొవ్వొత్తి ఒకటి వెలుగుతున్నది. వృద్ధుడి నోటి నుండి ఏవో వాక్యాలు అస్పష్టంగా వినిపిస్తున్నాయి.

"ఇతడెవరో మహానుభావుడై ఉంటాడు. ఏదో దైవ ప్రార్థన చేసుకుంటు

న్నాడు కాబోలు!" అనుకున్నాడు ఎడ్వర్డ్.

నెమ్మదిగా తలుపు తట్టాడు.

వృద్ధుడు కళ్ళు తెరిచి "ఎవరది?" అన్నాడు.

"నేను!.... ఈ దేశాన్ని పరిపాలించే మహారాజును!" అన్నాడు ఎడ్వ హుందాగా.

"తలుపుతెరిచే వుంది. లోనికి రావచ్చు" అన్నాడు వృద్ధుడు లేవకుండా.

ఎడ్వర్డ్ తలుపు తెరుచుకుని లోనికి వచ్చాడు.

"నా ఎదురుగా అగ్ని గుండం ముందు కూర్చో! నా వద్దకు చాలామంది జ్ఞాన సముపార్జన కోసం వస్తూ వుంటారు. కానీ వాళ్ళెవ్వరికీ జ్ఞానాన్ని సంపాదించుకునే అర్హతలేదు. సత్యాన్వేషణ వారికి కొరుకుడు పడలేదు. ఒక మహారాజు రాజ్యాన్ని సింహాసనాన్ని తృణ ప్రాయంగా ఎంచి వాటిని వదులుకుని, ఇక్కడి ప్రశాంత జీవితం గడపడానికి రావడం నిజంగా ఈ అడవి చేసుకున్న పుణ్య విశేషం!" అన్నాడు వృద్ధుడు.

'మహానుభావా! నేను ఇక్కడికి వచ్చింది శాశ్వతంగా నివాసం ఏర్పాటు చేసుకోడానికి కాదు. నాకు ఆకలిగా వుంది. తినడానికి యింత పెడితే, ఈ రాత్రికి యిక్కడ బసచేసి ఉదయమే వెళ్ళిపోతాను' అని చెబుదామనుకున్నాడు ఎడ్వర్డు.

కానీ ఆ వృద్ధుడు ఎడ్వర్డుకి మాట్లాడే అవకాశమే యివ్వలేదు.

ఆ వృద్ధుడు గుక్క తిప్పుకోకుండా యింకా మాట్లాడుతూనే ఉన్నాడు. "ఈ అడవి ప్రాంతం యావత్తూ పవిత్రతతో నిండి వుంది. నన్ను కలుసుకునేందుకు రోజూ దేవదూతలు యిక్కడికి వస్తూ ఉంటారు. ఓ రాజా! వాళ్ళు నాతో ఏమని చెబుతారో తెలుసా? 'స్వామీ! మీరు దేవదూతలలో ముఖ్యులు. భగవంతునికి మీరంటే ఎంతో ప్రేమ' అని నాతో చెబుతూ వుంటారు."

ఎడ్వర్డ్ వృద్ధుడి ముఖంవంక చూస్తూ కూర్చున్నాడు. వృద్ధుడు మాట్లాడటం ఆపుచేసాడు. అతడి పెదవులమీద అదొకరకమైన నవ్వు తాండవించింది.

చేతితో గెడ్డాన్ని సవరించుకుంటూ "నీకు యీ విషయం తెలుసా మహారాజా! నేను అప్పుడప్పుడు స్వర్గం వెళుతూ ఉంటాను. దేవుణ్ని కలుసుకుని మాట్లాడుతూ ఉంటాను. నేను స్వర్గంలోని వీధుల్లో నడిచి వెళుతున్నప్పుడు అక్కడ తిరిగే దేవతలు నన్ను చూసి ప్రక్కకు తొలగి దారియిస్తారు. నాకు వంగి నమస్క-

రిస్తారు. ఓ మహారాజా! నువ్వు స్వర్గం రాలేకపోయినాసరే ఫర్వాలేదు. భగవంతుడు అక్కడనుండే నిన్ను దీవిస్తాడు. నీ విషయం అతనితో తప్పక చెబుతాను" అన్నాడు వృద్ధుడు.

అంతవరకు ఎడ్వర్డ్‌కి, ఆ వృద్ధుడంటే భయం వేయలేదు. కానీ యిప్పుడు అతడి పిచ్చిమాటలు విన్న తర్వాత నిజంగానే భయపడ్డాడు.



నిద్రపోతున్న యువరాజును చంపడానికి వృద్ధుడు కత్తిని పైకెత్తుట.

'ఈ వృద్ధుడు ఎవడోకానీ నిజంగానే పిచ్చివాడు!' అనుకున్నాడు ఎడ్వర్డ్.

వృద్ధుడు ఎడ్వర్డ్ సమీపంగావచ్చి "యధార్థానికి నేను జోప్‌ను! అయినా సరే నేను దేవదూతలందరికీ ముఖ్యుడను! ఒక విషయం చెప్పనా నీకు! ఎనిమిదవ హెన్రీ రాజు నన్ను కించపరిచాడు. అవమానించాడు. చిన్నచూపు చూసాడు. నన్ను రాజ్యంనుండి వెళ్ళగొట్టాడు" అని పళ్ళు పటపట కొరుకుతూ రాజుకు

శాపనార్థాలు పెట్టడం ప్రారంభించాడు.

"అయితే నేను ఎనిమిదవ హెన్రీరాజును కాను! అతని కుమారుడను! నా పేరు ఎడ్వర్డ్!" అన్నాడు.

తక్షణం వృద్ధుడి ముఖంలో మార్పువచ్చింది. క్రూరంగా ఎడ్వర్డ్ ముఖం వంక చూసాడు.

"నాతో రా....! నిద్రపోయే స్థలాన్ని చూపిస్తాను. బాగా అలసి ఉన్నావు. హాయిగా నిద్రపో!" అంటూ వృద్ధుడు ఎడ్వర్డుని ఎండుగడ్డితో తయారుచేసిన శయ్య వద్దకు తీసుకుపోయాడు.

అప్పటికే బాగా అలసిపోయిన ఎడ్వర్డు గడ్డిమీద పడుకుని ఆదమరచి నిద్రపోయాడు.

ఆ వృద్ధుడు కసాయికత్తిని తీసుకుని దానిని నున్నని రాయిమీద నూరుతూ పదును పెట్టడం ప్రారంభించాడు.

"నీ తండ్రి చనిపోయాక నువ్వు రాజువయ్యావన్నమాట! ఎవరైతేనేమి! రాజు రాజే కదా....! ఇక నువ్వు నానుండి తప్పించుకుపోలేవు. చంపడానికి నీ తండ్రి లేడు కదా....! అందుచేత నిన్ను చంపి నా కసి తీర్చుకుంటాను. నన్ను ఎవరనుకుంటున్నావు! దేవదూతలలో ముఖ్యమైనవాడిని....! తెలుసా?" అన్నాడు వృద్ధుడు వికటంగా నవ్వుతూ.

ఆ తర్వాత వృద్ధుడు కత్తి తీసుకుని, ఎడ్వర్డు పడుకున్నచోటికివచ్చి మోకాళ్ళమీద కూర్చున్నాడు. కత్తి రెండుచేతులతోనూ పుచ్చుకుని పైకి ఎత్తాడు.

అదే సమయంలో తిన్నగా పడుకున్న ఎడ్వర్డు కుడివేపుకు వొత్తిగిల్లాడు.

వృద్ధుడు కత్తిని దించి 'ఇది అర్థరాత్రి. నిశ్శబ్ద సమయం. కత్తిదెబ్బ తింటూనే కుర్రవాడు బాధతో పెద్దగా కేకలువేయవచ్చు. ఆ కేకలు దూరంగా వెళ్ళే మనుషులకు వినిపిస్తాయి. వాళ్ళు యిక్కడికివస్తే నా రహస్యం బైటపడుతుంది' అనుకున్నాడు.

వెంటనే ఓ తాడు తెచ్చి కుర్రవాడి కాళ్ళూ చేతులూ బిగించి కట్టేసాడు. అతడు అరవకుండా తోలు పటకా ఒకటి తెచ్చి నోటికి కట్టేసాడు. తర్వాత ఎడ్వర్డుని మోసుకుంటూ తెచ్చి అగ్నిగుండం ముందు పడుకోబెట్టాడు. ముసలివాడు తనని చంపుతాడని ఎడ్వర్డ్ నిర్ధారణ చేసుకున్నాడు.

"నీ యిష్టదైవాన్ని ప్రార్థించుకో" అన్నాడు వృద్ధుడు ఎడ్వర్డ్‌తో.

## 16

వృద్ధుడు తన చేతిలోని కత్తివేపు కొన్ని క్షణాలపాటు ఎగాదిగా చూసుకున్నాడు. తర్వాత వచ్చి కుర్రవాడి వద్ద కూర్చున్నాడు. ఎడ్వర్డ్ ముసలివాడి వంక భయపడుతూ చూసాడు. వృద్ధుడు దెయ్యంలాగ వికృతంగా నవ్వాడు. కత్తిని అటు యిటు తిప్పాడు.



వృద్ధుడు, యువరాజు కాళ్ళూ చేతులూ, నోరూ కట్టేసి, ఎత్తుకొచ్చి అగ్ని గుండం ముందు కూర్చోబెట్టుట.

"అయితే నువ్వు, నా శత్రువు కొడుకువన్నమాట! మీ నాన్న భగవంతుడికి నిలయమైన చర్చిని నాశనం చేసాడు. ఇందుకు శిక్షగా నేను నా శత్రువు కొడుకును చంపుతాను" అంటూ వృద్ధుడు మందహాసం చేసాడు.

కాళ్ళూ చేతులకు కట్టిన తాళ్ళు వదులు అవుతాయేమోనని ఎడ్వర్డ్ ఎంతో

ప్రయత్నించాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. 'కనీసం నోటికి కట్టిన తో పట్టీ అయినా వస్తే బాగుండును. పెద్దగా కేకలు పెట్టవచ్చు' అనుకున్నాడు ఎడ్వ

అంతలో బైట తలుపు ఎవరో కొడుతున్న శబ్దమైంది. తలుపు తెరవటా వృద్ధుడు అటుగా వెళ్ళాడు. వృద్ధుడు బయట ఎవరితోనో మాట్లాడుతున్న మాట ఎడ్వర్డ్‌కి వినిపించసాగేయి.

"ఆ కుర్రవాడు ఎక్కడ? ఆ కుర్రవాడి కోసం వెదుకుతున్నవాళ్ళు 'వ నుంచి తప్పించుకున్నాడు. ఇటు అడవిలోకి పారిపోయి వచ్చాడు' అని నా చెప్పారు. నిజం చెప్పు! కుర్రవాడెక్కడ?" అడుగుతున్నారు ఎవరో.

అయితే ఎడ్వర్డు ఆ గొంతు గుర్తుపట్టాడు. ఆ గొంతు మైల్స్ హెండన్‌ది!

"ఓ! నువ్వు మాట్లాడుతున్నది అడుక్కునే కుర్రవాడి గురించి కదు వంటకు పుల్లలు ఏరుకు రమ్మని అడవిలోకి పంపించాను. ఈ పాటికి వస్తూ ఉండాలి" అన్నాడు వృద్ధుడు.

"నువ్వు సన్యాసిలాగ కనిపిస్తున్నావు. అబద్ధాలు చెప్పకు! నీలాం వాళ్ళంటే నాకు చాలా గౌరవం. నన్ను చెడ్డవాడిని చేయకు!" అన్నాడు హెండన్

'ఏదో ఒక శబ్దం చేస్తే హెండన్ లోనికి వస్తాడు' అనుకున్న ఎడ్వర్డు రే పెట్టెను కాలితో కొట్టాడు.

"లోపల ఏదో అలికిడి అవుతున్నదేమిటి?" హెండన్ అడిగాడు.

"ఏం లేదు. ఇంట్లో ఎలుకలు ఉన్నాయి." వృద్ధుడు సమాధాన చెప్పాడు.

హెండన్ కొద్దిసేపు మౌనంగా ఉన్నతర్వాత "మా కుర్రవాడు యింక రాలేదేమిటి? అడవిలో దారితప్పి ఉంటాడంటావా?" అన్నాడు.

"అలా జరిగి ఉండవచ్చు!" అన్నాడు వృద్ధుడు.

"అయితే యిక్కడున్న యీ గాడిదపలమీద ఎక్కి మనం కుర్రవాడిని వెద డానికి అడవిలోకి వెళ్దాం పద!...." అన్నాడు హెండన్.

ఆ తర్వాత వాళ్ళ మాటలు వినిపించలేదు. గాడిదల ఓండ్రింపులు, రణగొ ధ్వనులు వినిపించాయి. హెండన్ తనని విడిపిస్తాడన్న ఆశ పోయింది ఎడ్వర్డుకి.

అకస్మాత్తుగా ఎడ్వర్డు తల పైకెత్తి చూసాడు. అతడికి ఎదురుగా జాన్ కేంటీ, హ్యూగో నిలబడి ఎడ్వర్డు వంక రాక్షసుల్లాగ చూడసాగేరు. వాళ్ళు గబగబా ఎడ్వర్డు కట్లు విప్పారు. అతణ్ని రెండు చేతులతో ఎత్తి నిలుచుండ బెట్టారు. ఆ

తర్వాత అతడ్ని తీసుకుని గబగబా బయటికి వెళ్ళిపోయారు.

17

"మహారాజావారు కలకాలం వర్థిల్లాలి! .... ముష్టి మహారాజుకీ జై!" అన్నారు ముష్టి సంఘ సభ్యులు.

కొంత మంది ఎడ్వర్డు చేతులు బట్టలు పుచ్చుకుని ముందుకు లాగారు.



వృద్ధుడు అలా వెళ్ళగానే జాన్ కేంటీ, హ్యూగో ఇద్దరూ వచ్చి యువ రాజు కట్లు విప్పి తీసుకువెళ్ళుట.

ఎడ్వర్డు వెళ్ళి నేలమీద పడ్డాడు. అందరూ నవ్వుతూ చప్పట్లు కొట్టారు. కొంత మంది పిల్లి కూతలు నక్క కూతలు కూసారు.

రాజుగా నటిస్తూ ధైర్యంగా నిలబడినందుకు కొంత మంది ఎడ్వర్డు మెచ్చుకున్నారు. అయితే చాలామంది, ఎడ్వర్డుని ఏ విధంగానైనా బాధ పెట్టాల

తగినట్టు బుద్ధి చెప్పాలనీ, మళ్ళీ ఎక్కడికీ పారిపోకుండా చేయాలని నిశ్చయించు కున్నారు. వాళ్ళల్లో ముఖ్యులు జాన్ కేంటీ హ్యూగోలు!—

హ్యూగో ఎడ్వర్డుని వెక్కిరిస్తూ, కుంటుతూ నడిచివచ్చి అతడి కాలి వ్రేళ్ళను బలంగా తొక్కాడు.

"ఓ గొప్ప చక్రవర్తీ! చూడకుండా మీ కాలు తొక్కాను. క్షమించండి ముష్టి మహారాజా!" అన్నాడు హ్యూగో నవ్వుతూ.

ఎడ్వర్డుకి కోపం వచ్చింది! 'నోరు మూసుకుని వుంటే వీడికిలోకువగా కనిపెస్తున్నాను. తగిన గుణపాఠం నేర్పాలి' అనుకున్నాడు. వెంటనే అటు యిటు చూసాడు. ఒకచోట లావుపాటి కర్ర కనిపించింది. ఎడ్వర్డు దానిని చేతికి తీసు కున్నాడు.

"నువ్వు పెద్ద మొనగాడిననుకుంటున్నావు కదూ! ఏదీ యిప్పుడు నాతో ద్వంద్వ యుద్ధానికిరా! నీ సంగతేమిటో తేలుస్తాను" అంటూ ఎడ్వర్డు హ్యూగోని కవ్వించాడు.

హ్యూగో వికటంగా నవ్వి "ఒరేయ్ ముష్టి వెధవా! ఈ చేతుల్లో పెద్ద బొమ్మలు తిరిగిన వాళ్ళే మట్టి కరిచారు. రా! కుర్ర కుంకవి నువ్వెనగా ఎంత?.... నా చేతిలో నీ తల రెండు చెక్కలైనట్టే!" అంటూ అతడు కూడా ఓ పెద్ద కర్రను తీసుకున్నాడు.

మిగతా వాళ్ళల్లో ఉత్సాహం పెరిగింది. అందరూ వాళ్ళిద్దరి చుట్టూ వలయాకారంగా నిలుచున్నారు.

వాళ్ళిద్దరి మధ్యా కర్ర యుద్ధం ప్రారంభమైంది. కర్రతో మొరటు దెబ్బలు కొట్టడం ప్రారంభించాడు. హ్యూగో ఎడ్వర్డ్ ఆ దెబ్బల నుండి అతిలాఘవంగా తప్పించుకోసాగేడు. ఖడ్గ విద్యానిపుణుల వద్ద ఎంతో తర్ఫీదు పొందిన ఎడ్వర్డుకి హ్యూగో కర్రదెబ్బల నుండి తప్పించుకోవడం ఏమంత కష్టంకాదు.

ఎడ్వర్డుకి కర్రసాము ఖడ్గవిద్య బాణాలు వేయడం గుర్రపుస్వారీ అన్నీ బాగా వచ్చిన విద్యలు!

హ్యూగో కొడుతున్న ప్రతి దెబ్బనూ తన కర్రతో అడ్డుకుంటూ వచ్చాడు ఎడ్వర్డు. చివరకు హ్యూగో బాగా అలసిపోయాడు. అతడు కొట్టిన ఆఖరుదెబ్బను ఆపుకుంటూ తన కర్ర పైకెత్తి బలంగా హ్యూగో నెత్తిమీద ఒకటి, వీపుమీద ఒకటి, దెబ్బలు వేసాడు ఎడ్వర్డు.

హ్యాగో తలదిమ్మెక్కి పోయింది. వీపుమీద పడినదెబ్బకు పక్క టెముకలు కదిలి పోయాయి.

"నేను తలుచుకుంటే నీతల రెండు చెక్కలు చేయగలను నిన్ను చంపడం నా అభిమతంకాదు....రత్న ఖచితమైన నా కరవాలం వుండి వుంటే నీ తల తెగినేల మీదపడి వుండేది. బ్రతికిపోయావు. ఫో!" అన్నాడు ఎడ్వర్డు చేతిలోని కర్రను దూరంగా విసిరివేస్తూ.



యువరాజు తసనికొట్టి అవమానించాడన్న కోపంతో హ్యాగో బుట్టను దొంగతనంచేసి, యువరాజును దొంగగాపట్టి అప్పగించుట!

అది చూసిన అందరూ నిశ్చేష్టులయ్యారు. 'హ్యాగో వంటి మొనగాడిని మట్టి కరిపించిన ఈ కుర్రవాడు సామాన్యుడు కాడు' అనుకున్నారు.

రఫ్లర్ ఎంతో ప్రయత్నించాడు ఎడ్వర్డుని ముష్టివాడుగా తయా చేయాలని!....కానీ ఎడ్వర్డు దానికి అంగీకరించలేదు....

"నీ తండ్రి యీ ముఠాలో సభ్యుడు!.... కనుక నువ్వుకూడా యీ ముఠాలో సభ్యుడివే!.... ముష్టి ఎత్తడం యిష్టంలేకపోతే దొంగతనాలు చెయ్!.... ఏదో ఒకటి చేయకపోతే నీకు తిండి ఎవరు పెడతారు?" అన్నాడు రఫ్లర్.

"అయితే నేను దొంగతనాలు చేస్తాను" అన్నాడు ఎడ్వర్డు.

"నీకు అందులో అనుభవంలేదు. నిన్ను హ్యూగో వెంట పంపుతాను. అతడికి సహాయకుడిగా దొంగతనంలోని మెలకువలు నేర్చుకో!" అన్నాడు రఫ్లర్.

దానికి ఎడ్వర్డు అంగీకరించాడు. 'ఈ దొంగలనుంచి, మోసగాళ్ళనుండి తప్పించుకు పారిపోవాలంటే ప్రజల మధ్యకు వెళ్ళడం ఒక్కటే మార్గం' అనుకున్నాడు.

'ఈ కుర్రవెధవ నా తల పగులగొడతాడా! తోటివాళ్లలో అవమానంపాలు చేస్తాడా? నాతో రానీయ్! వీటికి తగినట్టు బుద్ధిచెబుతాను' అనుకున్నాడు హ్యూగో.

వాళ్ళిద్దరూ నడుచుకుంటూ పట్టణంమధ్య భాగానికి వచ్చారు. అక్కడ ఓ లావుపాటి స్త్రీ పెద్దబుట్ట నెత్తిమీద పెట్టుకుని దారివెంట వెళుతూ కనిపించింది.

హ్యూగో, ఎడ్వర్డ్ చేయిపుచ్చుకుని ఆ యువతి వెనుకగా బయలుదేరాడు. సమయంచూసి ఆమె నెత్తిమీద బుట్టను అమాంతం పైకెత్తి దానిని ఎడ్వర్డ్ చేతిలో పెట్టేసాడు. తను ఎప్పుడు ఎక్కడనుండి ఉడాయించాలా! అని ఆలోచిస్తున్న ఎడ్వర్డుకి హ్యూగోచేసిన ఘనకార్యం అర్థంకాలేదు.

మరుక్షణం హ్యూగో, ఎడ్వర్డువైపు చేయెత్తి చూపిస్తూ "దొంగ! దొంగ!" అంటూ బిగ్గరగా అరవడం ప్రారంభించాడు.

ఆ లావుపాటి యువతి వెనుదిరిగి ఎడ్వర్డు చేయి బలంగా పుచ్చుకునే సమయానికి హ్యూగో ఆ ప్రదేశంనుండి మాయమైపోయాడు.

"దొంగవెధవా!.... వేలెడంత ఉన్నావోలేవో యిప్పటినుండే దొంగతనాలు మొదలుపెట్టావా? నీకు తగినబుద్ధి చెబుతాను చూడు!" అంటూ ఆ యువతి అటు యిటు చూసింది.

దారిప్రక్కన ఆమెకొక కర్ర దొరికింది. దానిని తీసుకుని ఎడ్వర్డు వీపు మీద దెబ్బలవర్షం కురిపించసాగింది. ఆమె చేతినుండి విడిపించుకునేందుకు ఎడ్వర్డుకి బలం చాలలేదు.

అదే సమయంలో ఓ వ్యక్తి అక్కడికివచ్చి ఆమె చేతిని పుచ్చుకుని ఆపు చేసాడు. ఎడ్వర్డుని తనవేపు లాక్కుని రెండుచేతులతోనూ హాదివి పుచ్చుకున్నాడు.

ఎడ్వర్డు తలెత్తి ఆ వ్యక్తి ముఖంవంక చూసాడు.

అతడెవరోకాదు; ఎడ్వర్డు స్నేహితుడైన మైల్స్ హెండన్!!

## 18

అక్కడ గొడవ జరుగుతుండగా పోలీసువాడొకడు వచ్చాడు. విషయం తెలుసుకున్నాడు. ఆ యువతిని, ఎడ్వర్డును వెంటబెట్టుకునివచ్చి కోర్టులో హాజరు పరిచాడు. హెండన్ కూడా ఎడ్వర్డు వెంట కోర్టుకు వచ్చాడు.

"ఆ బుట్టలో ఏముందో చూపించు!" అన్నాడు జడ్జి.

ఆ యువతి బుట్టమూత తీసింది. లోపల చక్కగా అలంకరింపబడిన పంది ఉన్నది.

"అది ఎంత ఖరీదు చేస్తుంది?" జడ్జి ప్రశ్నించాడు.

"ఇది మూడు షిల్లింగులు ఖరీదు చేస్తుంది యువర్ ఆనర్" అన్నదా యువతి.

అది వింటూనే హెండన్ ముఖం పాలిపోయింది. జడ్జి ముఖంలో కూడా విషాదచ్ఛాయలు అలుముకున్నాయి. బయటి జనం కోర్టు గదిలోకి రాకుండా తలుపులు మూసేయమని ఆజ్ఞాపించాడు.

తర్వాత పోలీసువాడు ఆ యువతిని ఒక మూలకు తీసుకువెళ్ళి "ఏదైనా వస్తువు పదమూడు పెన్నీలు ఖరీదు చేసేదిగా ఉండి అది దొంగలించబడితే దొంగిలించిన వ్యక్తికి శిక్ష ఏమిటో తెలుసా?.... ఉరిశిక్ష!"

అది వింటూనే ఆ యువతి గుండెలు బాదుకుంటూ "పాపిష్టిదానిని! ఆ విషయం నాకు తెలియదు నాయనా! తెలిస్తే అలా చెబుతానా? చిన్నకుర్రాడికి ఉరి శిక్ష వేయించడం నాకు సంతోషమా చెప్పు!" అంది.

"అయితే దొంగిలించబడిన పంది ఎనిమిది పెన్నీలేనని జడ్జిగారితో చెప్పు!" అన్నాడు పోలీసువాడు.

వెంటనే ఆ యువతి బోనులో నిలబడి "క్షమించండి యువర్ ఆనర్! ఇందాక పొరబాటుగా చెప్పాను. నా పంది కేవలం ఎనిమిది పెన్నీలు మాత్రమే ఖరీదు చేస్తుంది" అని చెప్పింది.

జడ్జి కుర్రవాడిని జైలుకు తీసుకు వెళ్ళమని తీర్పు చెప్పాడు.

ఆ యువతి బుట్ట నెత్తికెత్తుకుని బయలుదేరింది. పోలీసువాడు ఆమెను అనుసరించి తలుపు వరకూ వెళ్ళి "చూడు తల్లీ! నాకు పంది కావాలి కానీ, ఇదిగో.

యీ ఎనిమిది పెన్నీలు తీసుకుని, దానిని ఇలా ఇవ్వు!" అన్నాడు.

"మూడు షిల్లింగులు ఖరీదుచేసే దీనిని ఎనిమిది పెన్నీలకు యివ్వడమా! భలేవారే! నేనంత పిచ్చిదానిని అనుకుంటున్నారా ఏమిటి?" అన్నదా యువతి నవ్వుతూ.



దొంగతనం నేరంమీద పోలీసు అధికారి యువరాజును తీసుకు వెళు తుండగా హెండన్ వచ్చి విడిపించుట.

"అంటే నువ్వు కోర్టులో అబద్ధం చెప్పావన్నమాట! పద! జడ్జిముందు నిజం చెప్పు! లేకపోతే నన్ను చెప్పమంటావా? అప్పుడు కుర్రవాడికి ఉరిశిక్ష, నీకు జైలుశిక్ష పడుతుంది. తెలుసా?" అన్నాడు పోలీసువాడు.

ఆ యువతి భయపడిపోయింది! ఏడవడం ప్రారంభించింది. "నా మూలంగా ఓ కుర్రవాడు చనిపోవడం నాకు యిష్టంలేదు" అంటూ ఆమె బుట్టను పోలీసువాడి

కిచ్చి ఎనిమిది పెన్నీలు తీసుకుని వెళ్ళిపోయింది.

పోలీసువాడు, కుర్రవాడిని వెంటబెట్టుకుని, వీధులగుండా జైలుకు బయలు దేరాడు. హెండన్ కూడా వాళ్ళ వెనుకనే బయలుదేరాడు.

"అన్నట్టు కానిస్టేబుల్ గారూ! ఆ యువతికి ఎంత యిచ్చి ఆ పందిని కొన్నారు?"

"పిచ్చి ఎక్కిందా నీకు? నేనేమిటి- డబ్బు యిచ్చి పందిని కొనడమేమిటి? ఇంతకీ నీకు ఏం కావాలి?" అన్నాడు కానిస్టేబుల్.

"ఆ కుర్రవాడు పారిపోయేందుకు అవకాశమివ్వు!.... కొద్దిగా అటు తిరిగి ఆదమరచి ఉన్నట్టు నటిస్తే చాలు. కుర్రవాడు పారిపోతాడు. కుర్రవాడిని తీసుకు వెళుతుంటే, ఎవరో వ్యక్తి వచ్చి కుర్రవాడిని లాక్కుని పారిపోయాడని కోర్టులో చెప్పు!" అన్నాడు హెండన్.

కానిస్టేబుల్ కోపంగా "అలా ఎన్నటికీ జరుగదు. నేను చట్టాన్ని రక్షించ వలసినవాడిని! నాచేత తప్పుడు పని చేయించాలని చూస్తే నిన్ను అరెస్టు చేయవలసి వస్తుంది తెలుసా?" అన్నాడు.

హెండన్ నవ్వి "నువ్వేదో నీతిమంతుడివలె మాట్లాడుతున్నావే! నువ్వు ఆ యువతి వద్దనుండి ఎనిమిది పెన్నీలకు పందిని కొన్నావు. ఆ విధంగా నువ్వు కోర్టును మోసం చేసావు. అంతేనా? బలవంతంగా ఆమెచేత జడ్జిముందు అబద్ధం చెప్పించావు. నేను తలుపు చాటున నిలబడి మీ సంభాషణ యావత్తూ విన్నాను. నేను కోర్టుకు వెళ్ళి మీ కథ అంతా జడ్జిగారికి చెప్పేస్తాను" అని బెదిరించాడు.

కానిస్టేబుల్ భయంతో వణికిపోయాడు. అదే జరిగితే తన ఉద్యోగం పోతుంది. పైగా కోర్టును మోసం చేసిన నేరానికి శిక్ష తప్పదు.

"సరే!.... కుర్రవాడి చేయి వదిలేస్తాను. పారిపోండి! రాత్రి ఎవరో వచ్చి జైలు తాళం బ్రద్దలుకొట్టి కుర్రవాడిని తీసుకుపోయారని చెబుతాను. రాత్రికి గొడ్డలి తెచ్చి నేనే తాళం బ్రద్దలుకొడతాను" అన్నాడు కానిస్టేబుల్.

హెండన్, ఎడ్వర్డుని తీసుకుని పిక్కబలంకొద్దీ పరుగుతీసాడు.

## 19

సర్ మైల్స్ హెండన్, ఎడ్వర్డుని తీసుకుని తిన్నగా తన ఇంటికి బయలు దేరాడు. వాళ్ళు 'హెండన్ హాల్'కు చేరుకున్నారు. తన కుటుంబం వాళ్ళు తనని ఆదరిస్తారో లేదోనని హెండన్ దారి పొడుగునా ఆలోచిస్తూనే ఉన్నాడు. దుష్ట

స్వభావంగల తన సోదరుడు హగ్ చేసిన ద్రోహాన్ని హెండన్ మరచిపోయాడు.

వాళ్ళు హెండన్‌హాల్ చేరాక "రండి మహారాజా! లోనికి దయచేయండి! మా గృహం పావనం చేయండి!" అన్నాడు మైల్స్ హెండన్ ఎడ్వర్డ్‌తో.

కొంతసేపు గడిచిన తర్వాత 'హగ్' ఇంటికొచ్చాడు. అక్కడున్న వాళ్ళను ఆశ్చర్యపోతూ చూసాడు.

హెండన్ లేచి వెళ్ళి తమ్ముణ్ని కౌగలించుకుని బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు. అయినా హగ్ హెండన్‌వంక కళ్ళుచిట్లించి చూస్తూ ఉండిపోయాడు.

"నన్ను గుర్తించలేదా తమ్ముడూ!" అన్నాడు హెండన్.

"పొరబడుతున్నావు. నువ్వెవరివో నాకు తెలియదు!" అన్నాడు హగ్.

"నేను నీ సోదరుణ్ని! మైల్స్ హెండన్! ఏడు సంవత్సరాలు కష్టాలు అనుభవించిన తర్వాత ఇంటికి తిరిగివచ్చాను" అన్నాడు హెండన్ బాధగా.

"ఇది చాలా పెద్ద మోసం! నువ్వు నా సోదరుడి మాదిరిగా ఉండవచ్చు. కానీ నిజంగా నువ్వు మైల్స్ హెండన్‌వి కాదు. మైల్స్ హెండన్ యుద్ధానికి వెళ్ళిన తర్వాత హెండన్ యుద్ధంలో పోరాడుతూ చనిపోయాడని అక్కడనుండి నాన్నగారికి ఉత్తరం వచ్చింది. బహుశా నువ్వు మైల్స్ హెండన్ తాలూకు భూతానివై ఉంటావు" అన్నాడు హగ్.

"లేదు! లేదు! నేను రక్తమాంసాలున్న మనిషినే!.... ఆర్థర్‌ని యిలా పిలుపు! అతడు తప్పక నన్ను గుర్తుపడతాడు."

"ఆర్థర్ చనిపోయి చాలాకాలమైంది."

"ఓ! ఎంత దుఃఖకరమైన వార్త! అయితే నాన్న ఎక్కడ?"

"అతనుకూడా యీ ప్రపంచాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు."

"అయితే ఎడిత్ ఏమైంది? ఆమె కూడా........"

"లేదు! లేదు! ఆమె బ్రతికే వుంది. ఇక్కడే ఉంది!" అంటూ హగ్ లోనికివెళ్ళి ఎడిత్‌ని తీసుకొచ్చాడు.

ఆమె చుట్టూ అయిదుగురు దాసీలు ఉన్నారు. ఎడిత్ హెండన్‌ని నఖశిఖ పర్యంతం చూసింది.

"నువ్వు యీ వ్యక్తిని గుర్తుపట్టగలవా మైడియర్!" అన్నాడు హగ్ ఎడిత్‌తో.

"లేదు. ఇతడెవరో నాకు తెలియదు!" అంది ఎడిత్.

నీకేం అధికారముంది? నేను ఈ ప్రాంతానికి ప్రభువును. నిన్ను యీ క్షణంలో ఉరి తీయించే అధికారం ఉంది నాకు!" అన్నాడు హగ్ కోపంగా.

"నేను యీ రాజభవనాన్ని విడిచి వెళ్ళను. నేను నా తండ్రిగారి ఇంటికి వచ్చాను. కాదనడానికి నువ్వెవడివి! నేను యిక్కడే ఉంటాను. గుర్తుంచుకో" అన్నాడు హెండన్ కోపంగా.

హగ్ ఏమీ మాట్లాడకుండా విసురుగా లోనికి వెళ్ళిపోయాడు.

అంతవరకు అన్నదమ్ముల సంభాషణ ఆలకిస్తున్న ఎడ్వర్డ్ దిగ్భ్రాంతి చెందాడు.

అతడు హెండన్‌తో యిలా అన్నాడు :

"చూడు సర్ మైల్స్ హెండన్! నేను కూడా నా రాచరికాన్ని పోగొట్టుకున్నాను. నాకు బదులుగా మరొక కుర్రవాడు ఇంగ్లండ్‌ను పరిపాలిస్తున్నాడు. నేను మూడు ఉత్తరాలు రాసి యిస్తాను. ఒకటి లాటిన్, రెండవది ఫ్రెంచి, మూడవది గ్రీక్ భాషలలో ఉంటాయి. వాటిని తీసుకువెళ్ళి హెర్ట్‌ఫోర్డ్‌కి యివ్వు! అతడు రాజ ప్రాసాదంలో వుంటాడు. ఉత్తరాలు చూసిన తర్వాత అతడు మన రక్షణ నిమిత్తం సైన్యాన్ని పంపిస్తాడు."

కుర్రవాడు మళ్ళీ పిచ్చిగా మాట్లాడుతున్నందుకు హెండన్ ఆశ్చర్యపోయాడు.

అయినా సరే హెండన్ ఆలోచిస్తూ "నా వ్యవహారాలు ఏవైతే ఉన్నాయో వాటిని మొట్టమొదట యిక్కడ పరిష్కరించుకుని ఆ తర్వాత రాజధానికి వెళతాను ప్రభూ!" అన్నాడు.

"తెలివి తక్కువగా మాట్లాడకు హెండన్! మొదట నా రాజ్యం నాకు తిరిగి వస్తే, ఏదైతే నువ్వు పోగొట్టుకున్నావో అదే గాకుండా అంతకు పదింతలు నేను నీకు సమకూర్చగలను కదా!"

మరుక్షణంలో ఎడిత్ అక్కడికి వచ్చి "మృత్యుదేవత నిన్ను ఆహ్వానించకముందే దయచేసి యిక్కడినుండి వెళ్ళిపో" అంది ఆతృతగా.

హెండన్ నవ్వి "నాకు తెలుసు ఎడిత్. నువ్వు నన్ను మరచిపోలేదని చిన్నతనం నుండీ ఒకచోట పుట్టి పెరిగాము. కలిసి ఆడుకున్నాము. నువ్వు నన్నెలా మరచిపోగలవు?" అన్నాడు.

ఎడిత్ తలవంచుకుని "నేను నిస్సహాయురాలిని! హగ్ చేతిలో అధికారం ఉంది. ధనం ఉంది. అతడు నిన్ను చంపగలడు" అంది బాధగా.

మరుక్షణంలో కొంతమంది సైనికులు ఆయుధాలు ధరించి అక్కడికి వచ్చారు. హెండెన్‌నీ, ఎడ్వర్డ్‌నీ బంధించి తీసుకువెళ్ళి జైలులో పడేసారు.



హగ్ తన అన్ననూ, యువరాజునూ జైలులో పెట్టించుట.

## 20

పదిహేను రోజుల తర్వాత సైనికులు వచ్చి జైలులో ఉన్న హెండన్‌నీ ఎడ్వర్డ్‌నీ విడుదల చేసారు.

అతడి వస్తువులు యిచ్చేస్తూ "మళ్ళీ యీ ప్రాంతంలో కనిపించవద్దు. కనిపిస్తే మరణమే నీకు శరణ్యం!" అన్నారు సైనికులు.

హెండన్, ఎడ్వర్డ్‌ని తీసుకుని ముందుకు బయలుదేరాడు. చివరకు వాళ్ళు లండన్ నగరం చేరుకున్నారు. అక్కడ చాలా కోలాహలంగా ఉంది.

"ఈ నెల ఇరవయ్యో తారీఖున మహారాజు గారికి పట్టాభిషేకం జరుగుతుంది. ఆ మహోత్సవాన్ని చూడవలసిందేకానీ, వర్ణింప నలవికాదు" ప్రజలు విశేషంగా చెప్పుకోసాగేరు.

అది ఎడ్వర్డ్ విన్నాడు. 'అలా జరగడానికి వీల్లేదు' అనుకున్నాడు. ఆ సమయానికి ఎలాగైనా సరే వెళ్ళి దానిని ఆపుచేయాలని ఎడ్వర్డు నిశ్చయించుకున్నాడు.

ఇరవయ్యో తారీఖు రానే వచ్చింది. ఆరోజే రాజుగారి పట్టాభిషేక మహోత్సవం.

తెల్లవారకముందే టామ్ నిద్రలేచాడు. అభ్యంగన స్నానం చేసాడు. మహారాజు దుస్తులు ధరించాడు. లార్డులూ, రాజప్రముఖులూ, కులీనులూ టామ్ వెంట బయలుదేరారు.

టామ్ గుర్రాన్ని అధిరోహించాడు. వెస్ట్ మినిష్టర్ చర్చికి బయలుదేరాడు. మిగతావాళ్ళు గుర్రాలను అధిరోహించి అతడ్ని అనుసరించారు.

మహారాజును చూసేందుకు వీధులలో జనం క్రిక్కిరిసి ఉన్నారు. వాళ్ళు జయజయధ్వానాలు చేస్తున్నారు. టామ్ వాళ్ళవేపు చేతులు ఊపుతూ మందహాసం చేస్తున్నాడు. ఎటుచూసినా కోలాహలమే!

టామ్ జనంవేపు పరీక్షగా చూడసాగేడు తన పాత స్నేహితులు ఎక్కడైనా కనిపిస్తారేమోనని!.... చివరకు అతడి స్నేహితులంతా ఒకేచోట గుంపుగా కనిపించారు. తను టామ్ననీ నా కలలు నిజమయ్యాయి చూడండి! వాళ్ళను దగ్గరకు పిలిచి చెబుదామని ఉబలాటపడ్డాడు. కానీ దానివల్ల తన మహారాజ వైభవానికి అంతరాయం ఏర్పడుతుందని ఊరుకున్నాడు.

కొంతదూరం వెళ్ళిన తర్వాత అతడికి ఇద్దరు అక్కలూ, తల్లీ ఒకచోట నిలుచుని తననే చూస్తుండటం కనిపించింది.

టామ్ తల్లి అతడివేపే పరీక్షగా చూస్తూ ఉండటంతో ముఖం పక్కకు తిప్పేసుకున్నాడు.

టామ్ తన సమీపంగా అమర్చిన పెట్టెలోనుండి వెండినాణేలు గుప్పిటతో తీసి జనంమీదికి విసరడం ప్రారంభించాడు. అటువంటి అవకాశం మళ్ళీ వస్తుందో రాదోనని జనం నేలకు వంగి నాణేలు ఏరుకోవడం ప్రారంభించారు.

టామ్కి చాలా ఆనందంగా వుంది. అటువంటి మహోన్నతమైన అదృష్టం తన జీవితంలో యికరాదు. 'తను యీ ఇంగ్లండ్ సామ్రాజ్యానికే చక్రవర్తిని! తన మాట శాసనం. తననుమించిన అధికులులేరు!' అనుకున్నాడు గర్వంగా.

అయినా అతడి అంతరాత్మలో ఏ మూలనో 'ఇది తప్పు! ఎవరికో చెందిన రాజ్యాన్ని అపహరిస్తున్నావు. నీకన్నా పెద్దదొంగ మరొకడు ఉండడు' అన్న భావం

బాధ పెట్టకపోలేదు.

అదే సమయంలో ఓ యువతి టామ్ చుట్టూ రక్షణగా వస్తున్న సైనికులను, రాజభటులను తొలగించుకుని అతడి ముందుకొచ్చింది.

గుర్రంమీద కూర్చున్న టామ్ పాదం పుచ్చుకుని లాగింది. తన పాదం లాగినవారు ఎవరా! అనుకుని టామ్ తలదించి చూసాడు. చూస్తూనే నివ్వెర పోయాడు.



నవమాసాలు మోసి కని పెంచిన తల్లినే 'నువ్వెవరో నాకు తెలియదు' అని టామ్ చెప్పుట!

ఆమె ఎవరోకాదు. టామ్ మాతృమూర్తి!

"నాయనా టామ్!.... ఏమిటి బాబు యిదంతా? మనకీ పదవులు, భోగ భాగ్యాలు వద్దు. ఇంటికి పోదాం రా!" అన్నదామె.

చప్పున టామ్ తల ప్రక్కకు తిప్పుకుంటూ "ఎవరు నువ్వు? నువ్వెవ నాకు తెలియదు. వెళ్ళు వెళ్ళు!" అన్నాడు.

అంతే!.... సైనికులువచ్చి ఆమె చెరొక రెక్క పుచ్చుకుని జనం మధ్యకు తీసుకువెళ్ళి దూరంగా తోసిపారేసారు.

అదంతా టామ్ చూసాడు. అతడి హృదయం బాధతో మెలితిరిగిపోయింది. అతడి కళ్ళు మాతృమూర్తి అవస్థ చూసి చెమ్మగిల్లాయి.

'నేనింత స్వార్థజీవినా! నవమాసాలుమోసి కనిపెంచిన కన్నతల్లినే నువ్వె



వెస్ట్ మినిస్టర్ చర్చికి వచ్చిన ఎడ్వర్డ్, టామ్ శిరస్సున కిరీటం పెట్టి వద్దనీ, అసలు మహారాజును తానేనని చెప్పుట.

వరో నాకు తెలియదు!' అనగలిగిన స్వార్థపరుడినా! తండ్రి తన్నినా, నాయనమ్మ కర్రతో బాదినా, నన్ను ఒడిలోకి చేర్చుకుని ఓదార్చి యింత తిండిపెట్టిన కన్నతల్లినే కాదన్నానా?

టామ్ ముఖంలోని మార్పును, ఆవేదనను కనిపెట్టిన లార్డ్ హెర్ట్‌ఫోర్డు "ప్రభూ! తమరు ప్రజలవేపు నవ్వుతూ చూడాలి. ఆ యువతి వచ్చి తమ ఆనందాన్ని పాడుచేసింది!" అన్నాడు.

అనుకున్నారు.

తక్షణం లార్డ్ హెర్డ్‌ఫోర్డు లేచి "మహాజనులారా! నిశ్శబ్దంగా ఉండండీ! ఇప్పుడు మన ముందు ఓ కొత్త సమస్య ఉత్పన్నమైంది. అదేమంటే ఈ ఇద్దరిలో అసలైన మహారాజు ఎవరు? అని! దానిని మనం తక్షణమే పరిష్కరించాలి. ఇప్పుడు మనం 'నేనే మహారాజును!' అని చెబుతున్న కొత్త కుర్రవాడిని కొన్ని ప్రశ్నలు వేద్దాం! దానితో యదార్థం బయటపడుతుంది" అన్నాడు.

అక్కడున్న లార్డ్స్ తలకొక ప్రశ్న రాజభవనంలోని మందిరాల గురించి, ఏ మందిరంలో ఏమున్నదీ ఎక్కడ ఏఏ వస్తువులు ఉన్నదీ అడిగారు.

ఎడ్వర్డు వాటన్నిటికీ వెంటనే సమాధానం చెప్పాడు.

"ఆ విషయాలను మన మహారాజుగారు కూడా చెప్పగలరు. దానివల్ల సమస్య పరిష్కారం కాదు." అన్నారు కొంత మంది.

లార్డ్ హెర్డుఫోర్డు బాగా ఆలోచించి "ఒకే ఒక్క చిన్న ప్రశ్న వేస్తాను. మురికి బట్టల్లో వున్న కుర్రవాడు జవాబు చెప్పాలి అదే మంటే 'ది గ్రేట్ రాయల్ సీల్' అనగా మహారాజావారి పెద్ద రాజముద్ర ఎక్కడుంది?" అని అడిగాడు.

అప్పుడు ఎడ్వర్డ్ శయన మందిరాన్ని పర్యవేక్షించే లార్డుతో యిలా అన్నాడు! "మీరు నా శయనమందిరంలో పలికి వెళ్ళండి అక్కడ నారాజవస్తులు దాచిపెట్టే విశాలమైన గోడ బీరువా వుంటుంది. అందులో గుప్తంగా దాచి ఉంచిన లాకర్ ఉంటుంది. దాన్ని తెరవండి. దిగ్రేట్ సీల్ అందులో ఉంటుంది."

శయన మందిర పర్యవేక్షకుడైన లార్డుపరిగెత్తుకుంటూ రాజభవనంలో పలికి వెళ్ళాడు. మరికొంత సేపటికి తిరిగి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

"అతను చెప్పిన విధంగా అన్నీ గాలించి చూసాను. కాని 'దిగ్రేట్ సీల్' నాకు ఎక్కడా కనిపించలేదు." అని చెప్పాడు.

"ఈ కుర్రవాడెవరో పిచ్చివాడు! మహారాజుగారి పట్టాభిషేకం కానివ్వండి!" అన్నాడు లార్డుహెర్డుఫోర్డు.

"ఆగండి! తొందరపడకండి!....మన అందరికీ మహారాజు ఈ కుర్రవాడే! ఆగ్రేట్ సీల్ ఎక్కడుందో నేను మహారాజు గారికి గుర్తు చేస్తాను." అంటూ టామ్ ఎడ్వర్డ్ దిక్కు తిరిగి యిలా అన్నాడు.

"నేను మిమ్మల్ని మొట్ట మొదట ఎక్కడ కలుసుకున్నానో మనం ఎక్కడ బట్టలు మార్చుకున్నామో బట్టలు మార్చుకున్న తర్వాత మనం ఎక్కడ అద్దంలో చూసుకున్నామో బాగా గుర్తు చేసుకోండి!"

వెంటనే ఎడ్వర్డ్ "ఎవరైనా సరే! నా ఏకాంత మందిరానికి వెళ్ళండి. ఆ మందిరంలో అడుగుపెట్టే హక్కు నాకు తప్ప ఎవరికీ లేదు. ఆ ఏకాంత మందిరంలో పెద్ద నిలువుటద్దం వుంటుంది. నిలువుటద్దం ముందు పెద్ద బల్ల వుంటుంది. రాజముద్రిక ఆ బల్ల మీద వుంటుంది. తీసుకురండి!" అని చెప్పాడు.



తన పొరబాటును క్షమించమని టామ్ ఎడ్వర్డ్ కాళ్ళ మీద పడుట

ఒక లార్డు పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. కొంతసేపటికి పెద్ద బంగారు గిన్నెతో సహా తిరిగి అక్కడికి వచ్చాడు. ఆ బంగారు గిన్నెలో 'ది గ్రేట్ సీల్' ధగ ధగా మెరుస్తూ అందరికీ కనిపించింది.

"ఎడ్వర్డు మహారాజు కలకాలం జీవించాలి!" ప్రజల జయ జయధ్వానాలతో వెస్ట్‌మినిస్టర్ హాలు మారుమ్రోగి పోయింది.

అప్పటికప్పుడే ఎడ్వర్డు మహారాజ దుస్తులతో, రత్నాభరణాలతో అలంకరింపబడ్డాడు. ఆర్చిబిషప్ రత్నకిరీటాన్ని ఎడ్వర్డు తలమీద వుంచి ఇంగ్లండ్

మహారాజుగా ప్రకటించాడు.

కొద్ది క్షణాలనుండీ ఎడ్వర్డు మనసులో ఒక సందేహం మెదలసాగింది.

అతడు టామ్‌ని దగ్గరకు పిలిచి "చూడు మిత్రమా 'దిగ్రేట్ సేల్' ఎక్కడుందో నీకు తెలిసి కూడా దేనికి చెప్పలేదు? చెబితే నువ్వే యీ ఇంగ్లండ్ రాజ్యానికి మహారాజుగా పట్టాభిషేకం జరుపుకునేవాడివి కదా!" అన్నాడు.



కష్టాలన్నీ గట్టెక్కిన ఎడ్వర్డు చివరకు ఇంగ్లండు మహారాజుగా పట్టాభిషిక్తుడగుట

"ది గ్రేట్ సేల్ ఎక్కడుందో నాకు తెలిసినా చెప్పలేదు ఎందుకో తెలుసా మహారాజా! అంతా సద్దుమణిగినాక దానిని నాతోబాటు మా ఇంటికి తీసుకుపోదామని!" అన్నాడు టామ్.

"అది నీకేం ఉపయోగపడుతుంది!" అడిగాడు ఎడ్వర్డు ఆశ్చర్యపోతూ.

టామ్ మాట్లాడలేదు. తలవంచుకుని మౌనంగా ఉండిపోయాడు.

"భయంలేదు చెప్పు! నువ్వు ఏది చెప్పినా ఎవరూ నీకు ఎటువంటి హానీ
ంచరు" అన్నాడు ఎడ్వర్డు.

"ఈ రాజముద్ర చాలా బరువుగా ఉంది కదా! దీనితో గింజలు బద్దలు
తినవచ్చుకదా! అనుకున్నాను" అన్నాడు టామ్.

ఎడ్వర్డు నవ్వు ఆపుకోలేక బిగ్గరగా నవ్వేసాడు.

లన్నీ గట్టెక్కిన ఎడ్వర్డు చివరకు ఇంగ్లండ్ మహారాజుగా పట్టాభిషిక్తుడగుట.

## 22

ఎడ్వర్డు మహారాజు సభలో కొలువుతీరి ఉన్నాడు!

తన పక్కనే నిలబడిఉన్న లార్డుహెర్టుఫోర్డుతో "నేను చెప్పేవన్నీ రాసు
డి! అవన్నీ తక్షణం అమలు జరగాలి" అన్నాడు మహారాజు.

"తమ ఆజ్ఞ!" అన్నాడు హెర్టుఫోర్డు.

"హగ్ ప్రభువు రాజ్యంలోని జైలులో ఉన్న ఖైదీలనందర్నీ విడుదల
యాలి. హగ్ రాచరికాన్ని రద్దు చేయించి అతణ్ని కారాగారంలో బంధించాలి.
మైల్స్ హెండన్ ఎక్కడఉన్నా గాలించి నా సమక్షానికి తీసుకురావాలి...."

కొంతమంది రాజప్రసాదం బయటికి వెళ్ళి అక్కడ అటు యిటు తిరుగు
న్న హెండన్‌ని తీసుకొచ్చి రాజుముందు హాజరు పరిచారు.

మొదట హెండన్ తన కళ్ళను నమ్మలేకపోయాడు. తన వెంట తిరిగిన
రవాడు నిజంగానే మహారాజు అని తెలిసేసరికి రాజభక్తితో అతడిముందు మోక
నమస్కరించాడు.

తర్వాత అక్కడున్న కుర్చీని లాక్కుని దానిమీద కూర్చున్నాడు.
దరూ ముక్కుమీద వేలేసుకున్నారు. హెండన్‌కి ఏమిటీ సాహసం! 'మహారాజు
ందు ఎంతటివారైనా సరే కూర్చోడానికి వీల్లేదు!' అనుకున్నారు. హెండన్‌ని
తలికి లాక్కుపోయేందుకు సైనికులు వచ్చారు.

"ఆగండి! అతణ్ని అక్కడ కూర్చోనివ్వండి! కష్టకాలంలో నన్ను ఆదు
న్నాడు. అప్పుడతనికి యీ వరాన్ని ప్రసాదించాను. హెండన్ సామాన్యుడు
డు. ఉన్నత రాజవంశానికి చెందిన మహావ్యక్తిగా గుర్తిస్తున్నాను. అతడు నా

సంరక్షకుడు! ఎల్లవేళలా నన్ను కనిపెట్టుకుని ఉంటూ, కాపాడవలసిందిగా కోరుతున్నాను" అన్నాడు ఎడ్వర్డు మహారాజు.

సర్ మైల్స్ హెండన్ కృతజ్ఞతా సూచకంగా లేచి మహారాజుకు వినయపూర్వకంగా నమస్కరించాడు.

హగ్‌ని పదవీచ్యుతుడ్ని చేసి కారాగారంలో బంధించారు.

ఎనిమిదవ హెన్రీ మహారాజు నిర్మించిన చర్చికి టామ్ ప్రధాన గవర్నర్‌గా నియమింపబడ్డాడు. అక్కడ అనాథ పిల్లలు పేద పిల్లల మంచిచెడ్డలు చూసేబాధ్యత టామ్‌కి యివ్వబడింది. అతడు ఎక్కడికి వెళ్ళినా మహారాజుకు యిచ్చె గౌరవ మర్యాదలను అతడికి యివ్వాలని ఆదేశాలు జారీ చేయబడ్డాయి. టామ్ తండ్రి ఏమయ్యాడో ఎవ్వరికీ తెలియలేదు. టామ్ నాయనమ్మ అప్పటికి కొద్దికాలం క్రితమే చనిపోయింది.

టామ్ తల్లికీ, అక్కలకూ వాళ్ళ జీవిత కాలమంతా కూర్చుని తింటూ హాయిగా గడపడానికి కావలసినంత ధన సంపద వాళ్ళకు యివ్వబడింది.

దేశంలో ఉన్న క్రూర చట్టాలన్నీ రద్దు చేయబడ్డాయి. వాటి స్థానంలో, ప్రజలకు న్యాయం, ధర్మం ప్రసాదించే నూతన చట్టాలు అమలులోనికి వచ్చాయి.

ఆరవ ఎడ్వర్డు మహారాజు ఎప్పుడూ తన సహచరులతో యిలా అంటూ ఉండేవాడు "నా చట్టాలు, ఎప్పుడూ దయతో కూడుకుని ఉంటాయి. దయా గుణం గొప్పతన మేమిటో నాకు తప్ప యీ రాజ్యంలో ఉంటున్న వారెవ్వరికీ తెలియదు. మంచితనం గురించి కూడా ఎవ్వరికీ తెలియదు. మంచివాళ్ళ క్షేమం కోసం నేను ఎన్ని బాధలైనా అనుభవిస్తాను. వాళ్ళకోసమే నేను జీవిస్తాను."

అయితే ఆరవ ఎడ్వర్డు మహారాజు చాలాకాలం జీవించలేదు. అయినా ఇంగ్లండ్ ప్రజలు ఎడ్వర్డు మంచితనాన్నీ, దయా గుణాన్నీ ఎన్నటికీ మరచిపోరు.

ఇంగ్లండ్ చరిత్రలోనే అతడు శాశ్వతమైన కీర్తిని గడించి రాజులందరిలోకే ఘనమైనవాడని పేరు పొందాడు.

—*—